# కర్మచక్రం

శిక్ష కాదు..శిక్షణ..



# కర్మచక్రం


రచన :

న్యూఏజ్ స్పిరిచ్యువల్ మాస్టర్

## భీమనేని వంశీ కిరణ్





**ఇన్స్టిట్యూట్ ఆఫ్ స్పిరిచ్యువల్ సైన్స్ & రీసెర్చ్ సెంటర్**

# కర్మచక్రం

ముద్రణ : అక్టోబర్, 2012 (2000 కాపీలు)
మార్చి, 2014 (2000 కాపీలు)
జూన్, 2016 (2000 కాపీలు)

వెల : ₹ **50/-**

రచయిత : **భీమనేని వంశీ కిరణ్**
5-30-7, తోకాడ, ఆటోనగర్, గాజువాక,
విశాఖపట్నం - 530 026.
✆ **9246672172, 9848460470**
✉ nitcomputers2010@gmail.com
f : vamsikiran
9246672172

ప్రతులకు : **ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పిరిచ్యువల్ సైన్స్ & రీసెర్చ్ సెంటర్**
డి.వి.యస్.ఎన్. ప్లాజా,
మోహిని థియేటర్ ప్రక్కన, గాజువాక,
విశాఖపట్నం - 530 026
✆ **9247685657, 9290535365**

# ముందుమాట



మనం ఆత్మగా భూలోకం వచ్చి అన్ని రకాల పరిస్థితులను అవగాహన చేసుకోవడం కోసం ఎన్నో కర్మలను చేస్తాం. తద్వారా వచ్చిన అన్ని రకాల కర్మఫలా- లను పొందడం కోసం ఎన్నో జన్మలు తీసుకుంటాం. అలా కొన్ని జన్మలు శైశవాత్మగా, కొంచెం ఎదిగి బాల్యాత్మగా, మరికొంచెం ఎదిగి యౌవ్వనాత్మగా, ఇంకొంచెం ఎదిగి ప్రౌఢాత్మగా చివరికి వృద్ధాత్మగా మారి జన్మ పరిసమాప్తం చేసుకుంటాం. శైశవాత్మగా వచ్చిన మనం వృద్ధాత్మగా మారడానికి ఎన్ని జన్మలు పడతాయనేది మన జ్ఞాన సముపార్జనపై ఆధారపడి ఉంటుంది.

కనుక ఇప్పుడు మనం అనుభవిస్తున్న సుఖ దుఃఖాలు ఒకప్పుడు మనం వేరొకరికి కల్పించాం కనుక వాటిని మనమే ఇష్టపూర్వకంగా ఎంపిక చేసుకొని భూమిమీదకు వచ్చామన్నది సత్యం. మన స్వప్రజయోనాల కోసం స్వార్థంతో మరొక ప్రాణికి కల్పించిన వేదనలు తిరిగి మనం అనుభవించాల్సి వస్తుదన్నది సృష్టి నియమం. ఈ బాధలన్నీ మనకి ఒకానొక శిక్షణ మాత్రమే. దీనినే కర్మ అంటారు.

మనం అనుభవించే బాధలు భగవంతుడు మనకి ఇచ్చిన శిక్ష కాదు శిక్షణ అని, అసలు బాధలు అనుభవించేవారంతా పాపాత్ములు కాదు, ధైర్యంగా కర్మలను తెచ్చుకున్న ధీరోత్తములని వాటిని పరిశూన్యం చేసుకునే మార్గం కర్మధ్యానం అని, కృష్ణుడు చెప్పిన 'జ్ఞానాగ్నిదగ్ధ కర్మాణాం' అన్న సత్యాన్ని, అత్యంత సులభశైలిలో వివరణాత్మకంగా 'న్యూఏజ్ స్పిరిచ్యువల్ మాస్టర్ వంశీ' గారు కర్మ సిద్ధాంతంపై అనేక పరిశోధనలు చేసి అందించిన గ్రంథరాజం 'కర్మచక్రం'. దీనిని చదివి మీ సమస్యలకు, అనారోగ్యాలకు కారణాలను తెలుసుకుని వాటిని స్వయంగా పరిష్కరించు కుంటారని కోరుతూ....

**వెంకట సుధీర్ డి.**

రవితేజ టెక్స్‌టైల్స్, ఒంగోలు



చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవ ।
చేసుకోని వారికి చేసుకోనంత మహదేవ ॥

ఒకసారి పురావస్తు శాఖవారు ఒక పెద్ద జమిందారు బంగ్లాను మ్యూజియంగా మార్చారు. అందులో పురాతనమైన 20×20 అడుగుల పెద్ద పెద్ద అద్దాలు ఉన్నాయి. వాటిని తరలించడానికి ప్రధాన ద్వారం నుంచి ప్రయత్నం చేశారు. ద్వారాలేమో 6 అడుగులే ఉన్నాయి. ద్వారా బంధాలు కాని, అద్దాలు కాని పగలగొట్టకుండా బయటకు ఎలా చేర్చాలో అర్థంకాక అధికారులందరూ తలలు పట్టుకున్నారు. ఎన్నిరోజులు గడచినా అద్దాలు ఆ బంగ్లాలో ఉన్న ద్వారాల్లోంచి బయటకు తెచ్చే మార్గం దొరకలేదు.

ఒకరోజు అక్కడే ఉన్న పిల్లవాడు "అసలు ఇంత పెద్ద అద్దాలు లోపలికి ఎలా వచ్చాయి" అంటా ఆశ్చర్యం వెలుబుచ్చాడు. అంతే అందరికీ మెరుపులా ఆలోచన వచ్చింది. అవును కదా! ఇంత పెద్ద అద్దాలు లోపలకి వచ్చాయంటే ఖచ్చితంగా బయటకు వెళ్ళే దారి ఉండే ఉంటుంది అని వెతకటం మొదలు పెట్టారు. ఆ వెతుకులాట తొందరలోనే ఫలితాన్ని ఇచ్చింది. షన్‌షెడ్ క్రింద ఉన్న 30 అడుగుల ఖాళీ ప్రదేశం నుంచి అద్దాలు లోపలకు తెచ్చి దానిని ఇనుప కమ్మీలతో మూసివేశారని అర్థం అయ్యింది. ఇంకేం దారి దొరికింది కదా ఆ గ్రిల్స్ విప్పదీసి అద్దాలు సురక్షితంగా బయటకు తీసుకువెళ్ళారు.

ఈ కథలో గొప్ప నీతి ఉంది. అది మన జీవితానికి దగ్గరగా ఉంది. 'భవనం' అంటే మన జీవితం, 'అద్దాలు' అంటే మన కష్టాలు. మనం ఎంత సేపటికి మన కష్టాలను మన జీవితంలోనుంచి ఎలా బయటకు పంపాలి, అనారోగ్యాల నుండి ఎలా తప్పించుకోవాలని ఆలోచిస్తూ సమయాన్ని, ధనాన్ని వృధా చేస్తున్నామేకాని అసలు అవి మన జీవితంలోనికి ఎందుకు వచ్చాయి అని మాత్రం ఆలోచించటం లేదు. ఎప్పుడైతే మనం అనుభవిస్తున్న బాధలు మనకే ఎందుకు వచ్చాయి? ఏ కార్యేకారణాల వల్ల వచ్చాయి? అని తెలుసుకోగలిగితే వాటిని వచ్చినదారినే బయటకు పంపవచ్చు.

***ఒక కార్యం జరుగుతుందంటే దానికి కారణం ఉండే తీరాలి.***

***ఆ కార్యే కారణ సంబంధమే 'కర్మచక్రం'.***

***ప్రకృతి శాసించిన ఒకానొక అద్భుత నియమం 'కర్మలు - కర్మఫలాలు'***

# కర్మలు - కర్మఫలాలు

'కర్మలు' అంటే మనం చేసే " పనులు ". 'కర్మఫలాలు' అంటే మనం చేసే పనుల ద్వారా వచ్చే "ఫలితాలు".

కర్మలలో, అంటే మనం చేసే పనులలో 3 రకాలు

1) పాపకర్మలు 2) పుణ్యకర్మలు 3) సత్యకర్మలు

1. **పాపకర్మ:** ఇతర ప్రాణికోటికి మనం ఉద్దేశ్యపూర్వకంగా మన ఆనందం కోసం, మన సౌకర్యం కోసం హాని కలిగించడమే పాపకర్మ. అంటే **"హింస చేస్తే" పాపం వస్తుందన్నమాట.**

2. **పుణ్యకర్మ:** ఇతర ప్రాణికోటికి మనం ఏదైనా ఆశించి గుర్తింపు కోరుకుంటూ చేసే సేవ పేరే 'పుణ్యకర్మ'.
**నేను అన్న భావనతో " సేవ " చేస్తే " పుణ్యం "వస్తుంది.**

3. **సత్యకర్మ:** ఇతర ప్రాణికోటికి మనం ఏదీ ఆశించకుండా, మరి ఏ గుర్తింపు కోరుకోకుండా చేసే "నిస్వార్థ" సేవ పేరే 'సత్యకర్మ'.
**ఏమీ "ఆశించకుండా" నిష్కామంగా చేసే సేవ వలన "సత్యకర్మ" ఫలితం వస్తుంది.**

సృష్టి యొక్క నియమం ఏమిటంటే ఎవరు ఏది చేస్తే దాని ప్రతిఫలం వారు అనుభవించవలసి వుంటుంది. కనుక కర్మలు, అది పాపమైనా, పుణ్యమైనా "ఏ ఉద్దేశ్యంతో" చేస్తున్నాము? అన్న దాని మీద మన "వాస్తవాలు" ఆధారపడి ఉంటాయి.

## కర్మలు, వాటి ఫలితాలు ఈవిధంగా ఉంటాయి

హింస ద్వారా 'పాపకర్మ' వస్తుంది.

తద్వారా 'రోగం' అనుభవించవలసి వస్తుంది.

సేవ ద్వారా 'పుణ్యకర్మ' వస్తుంది.

తద్వారా 'భోగం' అనుభవించవలసి వస్తుంది.

నిస్వార్థ సేవ ద్వారా 'సత్యకర్మ' వస్తుంది.

తద్వారా జీవునికి మోక్షం లభించి జననమరణ చక్రంలోంచి బయటపడి 'సత్యలోకం' ప్రాప్తిస్తుంది.

'పాపకర్మ' ద్వారా 'రోగంతో' పుడతాం.

'పుణ్యకర్మ' ద్వారా 'భోగంతో' పుడతాం.

పాపకర్మ - ఇనుప సంకెళ్ళు

పుణ్యకర్మ-బంగారపు సంకెళ్ళు

రెండింటిలోనూ జననమరణ చక్రం వుంటుంది. పాపకర్మ నుండి బయటపడాలంటే దానికి ప్రధాన కారణమైన హింసను విడనాడాలి. చాలామంది మేము "ఏపాపమూ చేయటం లేదు" అంటూ మాంసాహారం భుజిస్తారు. వీరి దృష్టిలో అది పాపం కాకపోవచ్చు. కాని పరమాత్ముని దృష్టిలో ప్రతి ప్రాణి యొక్కప్రాణం విలువ ఒక్కటే!

సృష్టికర్త దృష్టిలో ఏ మేక, ఏ కోడి, ఏ చేప ప్రాణమైనా మానవుని ప్రాణం కన్నా ఎంతమాత్రమూ తక్కువ కాదు!

కనుక మేకను, కోడిని, చేపను మరే ఇతర ప్రాణులనైనా మనం చంపితే, లేదా మన ఆహారం కోసం ఎవరి చేతైనా చంపించి భుజిస్తే అది హింసా కూడు అవుతుంది. తద్వారా పాపకర్మ జమ అవుతుంది.

అందుకే కృష్ణుడు స్పష్టంగా చెప్పాడు

"ఒక జీవిని చంపడానికి ఆమోదించేవాడు, చంపేవాడు, అవయవాలు నరికేవాడు, వండేవాడు, వడ్డించేవాడు, భుజించేవాడు, ఇలా అందరూ "హంతకులే, పాపకర్ములే".

ఎందుకంటే మనం ఒక చిన్న చీమకైనా ప్రాణం పోయగలమా? మనకు సృష్టించే శక్తి లేనప్పుడు, వధించే హక్కు కూడా లేదన్న విషయం సదా గుర్తించుకోవాలి?

(పాపకర్మ మరియు మాంసాహారంపై సాధకులు అడిగే ప్రశ్నలకు వంశీగారు ఇచ్చిన జవాబులు ఇక్కడ పొందుపరచబడినవి.)

***పవన్:*** "మాంసం తినడం వలన హింస చేస్తున్నాము" అంటున్నారు. మరి మొక్కల్ని కూడా తింటున్నాము, అది హింస కాదా?"

***వంశీ మాష్టర్:*** మీ జుట్టు కత్తిరిస్తే నొప్పి వస్తుందా ? రాదుకదా? కాని మీ ముక్కు కోస్తే నొప్పి వస్తుంది. మరి జుట్టులో కూడా ప్రాణం ఉంది కదా! జుట్టు కత్తిరిస్తే ఎందుకని నొప్పిలేదు?

ఎందుకంటే జుట్టుకు ప్రాణం, స్పందన మాత్రమే ఉంటుంది. అంతే కాని నరాలు, ఎముకలు లేవు. అందువలన నొప్పి ఉండదు. అలాగే మొక్కలకు ప్రాణం, స్పందన ఉంటాయి. అవి కణజాలంతో నిర్మితమౌతాయి కనుక వాటికి నొప్పి ఉండదు. అందుచేత మొక్కలను తెంపడం వలన అవి హింసకు గురికావు. కొమ్మ తెంపితే మరలా చిగురు వస్తుంది, కోడికి కాలు కత్తిరిస్తే కాలు వస్తుందా? జంతువులకు మన శరీర వ్యవస్థ ఎలా వుంటుందో ఇంచుమించు అలానే ఉంటుంది. మనల్ని కోస్తే ఎంత బాధ కలుగుతుందో, జంతువులకు కూడా అలాంటి బాధే కలుగుతుంది. కనుక ఏ జంతువునూ చంపి తినవద్దు. మన తిండి మరో జీవికి ప్రాణసంకటం కాకూడదు.

***సన్యాసిరావు:*** మాష్టర్ ఎవరో చంపితేనే కదా మనం తింటున్నాము. అది కూడా దోషమేనా?

***వంశీ మాష్టర్:*** ఖచ్చితంగా దోషమే! మీరు తింటున్నారు. కనుక వారు చంపుతున్నారు. లేదంటే వారికేమైనా సరదానా? అందుకే చంపినవారికి 10%, వండిన వారికి 10%, తిన్నవారికి 80% పాపకర్మ జమకట్ట బడుతుంది. ఈ విషయంలో సృష్టి చాలా ఖచ్చితంగా లెక్కలు కడుతుంది.

***లక్ష్మీ:*** ఏంటి సార్, వండటం కూడా పాపమేనా? చంపేవాడు డబ్బుకోసం చంపుతున్నాడు కాబట్టి పాపకర్మలో అతనికి 10% అన్నారు బాగానేవుంది. తినేవాడు తనకోసం తింటున్నాడు కాబట్టి 80%అన్నారు. అదీ బాగుంది, చుట్టాలు వచ్చారని ప్రేమతో మాంసము వండిపెట్టడం కూడా పాపమేనా?

***వంశీ మాష్టర్:*** ఏమంటున్నారు మీరు? ప్రేమతోనా? చుట్టాలు వచ్చారని ప్రేమతో వండుతానన్నారా? అదే చుట్టం మీ బిడ్డను వండిపెట్టమంటే వండుతారా? చుట్టాన్ని ఇరగదీస్తారు. అప్పుడేమౌతుందో మీ ప్రేమ. ప్రాణం పోయినా మీ బిడ్డకి హాని కలిగించనివ్వరు. కానీ ఏ కోడినో, మేకనో

వండేటందుకు ఉత్సాహంగా ముందుకు వస్తారు. ఎందుకంటే పోయేది మన వాళ్ళ ప్రాణం కాదు కదా! ఎంత విడ్డూరంగా ఉంది మీ ప్రేమ?

మన దృష్టిలో మన బిడ్డ ప్రాణం ఎక్కువ, మరొక జంతువు ప్రాణం తక్కువ. కాని పరమాత్ముని దృష్టిలో అన్ని ప్రాణులూ సమానమే! ఖచ్చితంగా మాంసం వండేవారికి కూడా పాపకర్మజన్మ జమ చేయబడుతుంది. ఇది సృష్టి నియమం బాగా గుర్తుంచుకోండి.

***మంగ:*** వంశీమాస్టర్ మీరు చెప్పారని నేను మాంసాహారం మానేశాను. కానీ నాభర్త ఒకరోజు 'నా' నోట్లో మాంసం పెట్టి తినమని బలవంతం చేసాడు. అతనిని బాధ పెట్టటం ఇష్టంలేక మాంసం తినడం మొదలు పెట్టాను. భర్త చెప్పిన మాటలు వినాలి కదా? అదే ధర్మం కదా.

***వంశీ మాస్టర్:*** ఓ ధర్మాత్మురాలా! నీ భర్త నోట్లో మాంసము పెట్టి తినమన్నప్పుడు పతి ధర్మం కోసం తిన్నావు, బాగానే ఉంది. అదే భర్త నోట్లో విషం పెట్టి తాగు, నీవు చస్తే నేను ఇంకొక పెళ్ళి చేసుకుంటానని కోరితే భర్తకదా! పతి ధర్మం కదా! అని అతను చెప్పినట్లు ఆ విషాన్ని తాగుతావా? లేదా అతన్ని తన్ని పారిపోతావా? ఏం చేస్తావు...?

ఎవరూ కూడా విషాన్ని తాగరు. విషం తాగమన్న వారిని కొట్టి పారిపోతాం. ఎందుకంటే ఇక్కడ పోయేది మన ప్రాణం కనుక. అందువలన ఖచ్చితంగా పోరాటం చేస్తాం.

నిజానికి "నీ లోపల" మాంసం తినాలన్న కోరిక వుంది. నేను చెప్పానని మానివేశావు. 'ఏ వంక' దొరుకుతుందా అని వెతికావు. అమాయకంగా నీ భర్త దొరికాడు. నేరం అతని మీద మోపి శుభ్రంగా మాంసం భుజించావు. ఇక్కడ నేరుస్తురాలివి నీవే, నీ భర్త కాదు. నీకు తినాలని వుంటే శుభ్రంగా తిను. ఎవరి మీదా వంకలు చెప్పవద్దు. రేపు దీని ప్రతిఫలాన్ని ఖచ్చితంగా ఎదుర్కోవలసినది నీవే అన్న విషయం గుర్తుంచుకో చాలు.

***వేణు:*** నిజమే మాస్టర్ మీరు చెప్పినట్టు మాంసం తినే వారే నేరస్తులు. అయితే నేను మాంసం తినడం మానేశాను కానీ అది వండినప్పుడు, తినే వారిని చూసినప్పుడు తినాలి అనిపిస్తుంది. మనస్సుని బలవంతముగా మళ్ళించుకుంటాను. ఆ 'చపలత్వాన్ని ఎలా పోగొట్టుకోవాలి దయచేసి చెప్పండి.

***వంశీ మాష్టర్:*** మైడియర్ వేణు, చాలా మంది మాంసాహారం, తాము తినకూడదనో, తింటే అనారోగ్యమనో లేదా తమ కుల పెద్దలు చెప్పారనో మాంసం మానివేయాలన్న నియమం పెట్టుకుంటారు. నియమాలు ఎన్నో రోజులు ఉండవు. మూలంలో మార్పురావాలి. "నేను తినే జంతువు ప్రాణం ఎంతో విలువైనది" అన్న ఎరుక రావాలి. హృదయం నిండా దయ, కరుణ నింపాలి ధ్యానం చేస్తేనే ఆ దయాహృదయం అలవడుతుంది.

నిజానికి మాంసాహారం అన్నది హృదయానికి సంబంధించినది. మీ హృదయానికి ఉన్న ప్రేమ తలుపులు తెరవండి. ప్రతి ప్రాణినీ దయతో, కరుణతో చూడండి. మీ కళ్ళ ముందున్న ప్రతి ప్రాణి మీ స్నేహితుడన్న భావనతో చూడండి.

మీ విస్తరిలో వడ్డించిన మాంసపు ముక్క నీ తోటి ప్రాణిని సంహరిస్తే వచ్చిందని గుర్తుంచుకోండి.

మీ నోట్లో పెట్టుకున్న మాంసపు ముక్క ఒక నిస్సహాయ స్థితిలో గిలగిలా కొట్టుకుంటూ ప్రాణం వదిలిన ఒక పసిహృదయం అన్న విషయం ఎరుకలో ఉంచుకోండి.దాని "మరణవేదన"ని జ్ఞప్తికి తెచ్చుకోండి.

అపుడు మీరు ఏ మాంసాన్నీ తినలేరు. జిహ్వాచాపల్యం అన్న సమస్యేలేదు. అప్పుడు మీలో సర్వప్రాణికోటితో మిత్రత్వంచెయ్యగల దివ్యత్వం వికసిస్తుంది. అదే"బుద్ధత్వంఅంటే".

***వివేక్:*** మాస్టర్ మనం తినే జంతువులను భగవంతుడు మన కోసమే సృష్టించాడు కదా! వాటిని చంపి తింటే దోషం ఏమిటి?

***వంశీ మాష్టర్ :*** మీరు చెప్పినట్టు నరమాంసం తినే వాళ్ళకి భగవంతుడు "మిమ్మల్ని సృష్టించి ఇచ్చాడు" అని చెపితే వాళ్ళకి ఆహారంగా మీరు వెళతారా? మనలో ఎవరైనా తమ ప్రాణాన్ని వదులుకోవడానికి సిద్దపడతారా? ఆత్మవంచన చేసుకోకుండా ఆలోచించాలి.

సృష్టిలో ఏ ప్రాణి మరొక ప్రాణి కోసం సృష్టించబడలేదు. ప్రతీ ప్రాణి "తన కోసం తాను సృష్టించబడినది" తన అనుభవాల కోసం ఈ భూలోకంలో మనలాగే జన్మ తీసుకొని వచ్చింది. అంతేకాని మీకోసం కాదు.

ఏ కోయిలా మన కోసం పాడదు. తన జతగాడి కోసం తాను పాడుకుం- టుంది. ఏ నెమలీ మన కోసం పురివిప్పదు. తన భాగస్వామిని ఆకర్షించడానికి ఆడుతుంది. మిమ్మల్ని బంధించడం, హింసించడం, చంపటం మీరు ఎలాగైతే ఆమోదించరో అలాగే ఏ ప్రాణీ తనని బంధించడాన్ని హింసించడాన్ని, చంపడాన్ని ఇష్టపడదు. ఒక ప్రాణి ఇష్టానికి వ్యతిరేకంగా చేసింది ప్రకృతి హింస క్రింద పరిగణిస్తుంది.

కనుక హింసద్వారా పాపకర్మ వస్తుంది. తద్వారా రోగాన్ని మోయవలిసి వస్తుంది. అందువలన హింసను విడనాడాలి,అప్పుడే పాప కర్మల నుండి సంపూర్ణ విముక్తి.

అంతేకాదు సేవతో పుణ్యకర్మలు సంతరించుకుంటే దాని ద్వారా వచ్చే భోగాన్ని అనుభవించడానికి మరలా జన్మ తీసుకోవలసి వుంటుంది.

కనుక పాపకర్మలు చెయ్యకుండా, ఏమీ ఆశించకుండా పుణ్యకర్మలు చేస్తూ పోతే అవి కాస్త 'సత్యకర్మలు'గా మారతాయి. అపుడే 'సత్యలోక వాసులం' అయ్యేది. ఈ జీవునికి జనన మరణ చక్రం నుండి విముక్తి లభించేది. కాబట్టి ఇక్కడ మనం ఏ పాప పుణ్యాలు చేసినా అవి పైలోకాల్లో కర్మల విభాగాల్లో విభజించబడి గుప్తచిత్రాలుగా రికార్డు చెయ్యబడతాయి.

## కర్మలు ఏ విధంగా విభజింపబడతాయి?

కర్మలు మూడు రకాలుగా విభజింపబడతాయి

అవి: 1) సంచిత కర్మలు 2) ప్రారబ్ధ కర్మలు 3) అగామి కర్మలు

***సంచిత కర్మలు :*** మనం గతంలో, లేదా గత జన్మలలో చేసిన పాప-పుణ్యకర్మల చిట్టా మొత్తం ఒక చోట నమోదు చేయబడి ఉంటాయి. వాటినే "సంచిత కర్మలు" అంటారు. ఎవరి రికార్డు వారికి ఉంటుంది. వీటినే "ఆకాషిక్ రికార్డ్స్" అని కూడా అంటారు. అధవా గుప్త చిత్రాలు.

***ప్రారబ్ధ కర్మలు:*** మనం మరణించి పై లోకాలకు వెళ్లి కొంత కాలం గడిచాక "మాష్టర్స్" సహాయంతో తిరిగి జన్మ తీసుకునే సమయంలో మన గత జన్మలలో చేసిన పాపాల, పుణ్యాల చిట్టా సరి చూసుకుని ఇతర ప్రాణికోటికి మనం చేసిన దాష్టికాలు, మన అజ్ఞానపు దశలో చేశామని గ్రహించి ఆ అజ్ఞానాన్ని పోగొట్టుకుని జ్ఞానాన్ని సంపాదించాలంటే ఆ పాపపుణ్య కర్మలకు

సరిసమానమైన రోగాలను – భోగాలను పొందుపరుచుకొని, ఈసారి జన్మలో మరలా ఎరుకతో ఉండాలని నిర్ణయించుకుని ఈ భూలోకంలో మళ్ళీ జన్మ తీసుకుని వచ్చి వాటిని అనుభవిస్తూ ఉంటాం. అవే ప్రారబ్ధ కర్మలు. అందుకేనేమో, మన పెద్దవాళ్ళు ఏదైనా ఇబ్బంది వచ్చినపుడు అంతా "నా ప్రారబ్ధం" అని వాపోతూ ఉంటారు.

***అగామి కర్మలు:*** జీవాత్మగా ప్రారబ్ధ కర్మలు తీసుకుని శిశువుగా జన్మించిన తరువాత అంతా మర్చిపోతాము. మరలా మాయలో పడి హింసాప్రవృత్తిలో ఉంటాము.

మళ్ళీ కొత్త 'చిట్టా' తయారుచేసుకుంటాం. వాటినే "అగామి కర్మలు" అంటారు. అథవా వర్తమాన కర్మలు అని కూడా పేరు.

కనుక "సంచిత కర్మలు" అంటే గత జన్మలో మనం చేసిన "పాపపుణ్యాల చిట్టా."

"ప్రారబ్ధ కర్మలు" అంటే ఇప్పుడు మనం అనుభవిస్తున్న "రోగాలు భోగాలు."

అగామి కర్మలు అంటే పుట్టిన దగ్గర నుండి మరణించే వరకు గతాన్ని మరిచి అజ్ఞానంతో చేసుకుంటున్న పాపపుణ్యాలు, రాబోయే కాలంలో తిరిగి అనుభవించవలసిన చిట్టా అన్నమాట.

**యర్రయ్య:** మాష్టర్ మన కర్మలను ఎవరు రికార్డు చేస్తారు. వాటికి ఎవరు సాక్ష్యం ఇస్తారు?

***వంశీ మాష్టర్:*** నీ మనస్సే వాటికి సాక్ష్యం. ఎందుకంటే మీరు ఎవరినైనా మాయ చేయగలరు, కానీ మీ మనస్సుకి తెలియకుండా మీరు ఏ పనీ చెయ్యలేరు కదా. కనుక భూలోకంలో మీరు చేసిన ప్రతీ పని మీ పర్సనల్ ఖాతాలో మీ 'మనస్సు' అన్న కెమెరా ద్వారా పైనున్న 'ఏంజిల్స్' రికార్డ్ చేస్తారు. ఇదంతా పక్కాగా జరుగుతుంది.

ఈ కర్మ చక్రం చాలా "ఖచ్చితంగా" ఉంటుంది.

## ఎవరు పాపాత్ములు ఎవరుపుణ్యాత్ములు

***వాసు:*** సార్ వ్యాధలు, అంగవైకల్యాలు అనుభవించేవారంతా పాపాత్ములా?

***వంశీ మాస్టర్:*** వాసు నీవు ముందుగా గుర్తుంచుకోవలసింది ఏమిటంటే ఏ ఆత్మ కూడా పాపాత్మ కాదు! అన్నీ కూడా "పుణ్యఆత్మలే! దివ్యాత్మలే!" కాకపోతే గుణాల ప్రభావితంతో అజ్ఞానపు దశలలో వారు చేసే అనుభరాహిత్య పనుల పేరే పాపాలు, కాకపోతే వాటిని ఎవరైతే చేసారో వారే తిరిగి అనుభవించి జ్ఞానం సంపాదించాల్సి ఉంటుంది అన్నది సత్యం. ఇక నీ ప్రశ్న ఎక్కువగా వ్యాధులు అనుభవించేవారు ఎవరనే కదా? వారంతా "ధైర్యవంతమైన ఆత్మలు". గట్స్ ఉన్న సోల్స్ అన్నమాట.

కొంతమంది పెరిగిపోయిన పాపాలను కొంచెం కొంచెం తీసుకొని భూలోకంలో వ్యాధుల రూపంలో అనుభవిస్తూ సంచిత కర్మలను ఎన్నో జన్మలకు శూన్యం చేసుకుని జననమరణ చక్రం నుండి విముక్తులు అవుతారు.

కొంతమంది అనేక జన్మలు తీసుకోవడం ఎందుకని సంతోషంగా అన్నింటినీ ఒకేసారి మోసుకుని క్రిందకు వస్తారు. వారు హోమ్‌వర్క్ ఎక్కువ తీసుకున్న విద్యార్థులన్నమాట. కనుక ఎక్కువ బాధలు,రోగాలు అనుభవిస్తున్న వారిని చూసి పాపాత్ములు అంటూ ఈసడించుకోవడం మానేసి వారి ధైర్యానికి అభినందించి వారిపై ప్రేమ, కరుణ చూపించాలి.

***రజని:*** మాష్టర్ తల్లిదండ్రులు చేసిన పాపాలు పిల్లలకి వస్తాయి అంటారు నిజమేనా?

***వంశీ మాష్టర్:*** ఖచ్చితంగా కాదు. ఎవ్వరి కర్మలు వారే అనుభవించాల్సి ఉంటుంది. ఆ పాపాలలో వారి పిల్లలు గతజన్మలో భాగస్వాములైతే వారు కూడా ఇప్పుడు ఆ కర్మలను అనుభవించాల్సి ఉంటుంది.

హిరణ్యకశ్యపుడు చేసిన దుష్కర్మలు ప్రహ్లాదుడు అనుభవించ లేదు కదా! ఈ వారసత్వ సాంప్రదాయాలన్నీ భూలోకంలో మనం పెట్టుకున్నవే, ప్రకృతి నియమాల్లో లేనేలేదు. అందుకే "సేత్" మహాశయుడంటారు.

"ఎవరి వాస్తవానికి వారే సృష్టికర్తలు".

***జానకి:*** పుణ్యకర్మలు చేస్తే భోగంతో తిరిగి పుట్టవలసి ఉంటుంది అన్నారు. మంచిదే కదా మాష్టర్?

***వంశీ మాష్టర్:*** మంచిదే కానీ, ఆ భోగపు జన్మ మాయలోపడి మళ్ళీ పాపపు కర్మలు చెయ్యడానికి అవకాశం ఉంటుంది. కనుక పుణ్యకర్మలు చేసేటప్పుడు నేను చెయ్యటం లేదు అన్న భావనతో "నిష్కామంగా" చెయ్యండి. అప్పుడు అది సత్యకర్మ అవుతుంది. తద్వారా సత్యలోక వాసులం అవుతాము. జనన-మరణ చక్రం నుండి విడివడతాము.

***భారతి:*** మాష్టర్ కర్మలను తెచ్చుకునేటప్పుడు ఈ పాపానికి ఈ రోగం, ఈ పుణ్యానికి ఈ భోగం అంటూ ఉంటుందా? దానిని ఎవరు నిర్ణయిస్తారు?

***వంశీ మాష్టర్:*** మీరు "ఏ జ్ఞానం" లేక ఇతర ప్రాణికోటికి ఆవేదన కలిగించారో "ఆ జ్ఞానం" పొందడానికి సరిసమానమైన "అనుభవజ్ఞానం" కలిగించే వ్యాధులు, కష్టాలు ఇష్టపూర్వకంగా తెచ్చుకుంటారు.

అందుకే కర్మను శిక్ష అనకూడదు. "శిక్షణ" అనాలి. ఇక ఇతర ప్రాణికోటికి మీరు ఏదైతే సేవను చేసారో దానికి ప్రతిఫలంగా బోగం రూపంలో భూలోకంలో అనుభవించాలి. రోగమా లేక భోగమా అనేది ఎంత స్థాయిలో అనేది పూర్తిగా ఎంచుకొనే స్వేచ్ఛ మనకు ఇవ్వబడుతుంది. కాకపోతే దానికి ఎన్ని జన్మలు పట్టినా సంచిత కర్మలను ఎవరికి వారే పరిశూన్యం చేసుకోవల్సిందే!

అందుకనే మనం దేహం కాదు, 'ఆత్మలం' అన్న విషయం సదా గుర్తించుకోవాలి. ఆత్మ పై లోకాల నుండి క్రిందకు వచ్చినపుడు సంతోషంగా రోగాన్ని-భోగాన్ని తీసుకొని వస్తుంది. ఎందుకంటే అనుభవజ్ఞానం కోసం. అందుకనే కర్మ "'శిక్ష" కాదు. "శిక్షణ"అనేది.

## కర్మ 'శిక్ష' కాదు 'శిక్షణ.'

***రామభద్ర రాజు:*** మాష్టర్ కర్మ శిక్షణ అంటున్నారు. మనం ఎంతో సంతోషంగా రోగాన్ని-భోగాన్ని తెచ్చుకుంటాం అంటున్నారు. అసలు ఎందుకు భూలోకంలో జన్మించాలి. ఎందుకు కర్మలు తగిలించుకోవాలి. ఈ శిక్షణ దేనికొరకు? దయచేసి వివరంగా చెప్పండి.

***వంశీ మాష్టర్:*** పరమాత్మ నుండి మనం అంశాత్మగా విడివడి కారణ లోకాల్లో స్థిరపడతాం. తరువాత దాని నుండి ఒక జీవాత్మను సృష్టించుకుని భూలోకం వస్తాం. ఎందుకంటే, అనేక అనుభవాలు అనేక జన్మల ద్వారా పొంది,

తద్వారా అనుభవ జ్ఞానం సంపాదించి, మనం కూడా "పూర్ణాత్మ"గా మారడం కోసం.

ఈ క్రమంలో జీవాత్మ మొదటగా శిలాజలాల్లో, తరువాత వృక్షరాజ్యంలో ఆ తరువాత జంతు రాజ్యంలో అనుభవాలు పొందిన పిదప మానవ రాజ్యంలో జన్మలు తీసుకుంటుంది. ఇలా అనేక జన్మలు గడిచిన తరువాత మానవ రాజ్యంలోనికి వచ్చిన మొదటి జన్మలలో సంచిత కర్మలు ఉండవు. ఎందుకంటే జంతుజన్మలో కర్మలు ఉండవు కనుక. ఎటువంటి సంచిత ధర్మలు లేకుండా సుద్ధాత్మగా మానవ జన్మలో ప్రవేశిస్తాం. మానవుడిగా జన్మలు పెరిగేకొద్దీ నేను, నాది అన్నతత్వం పెరిగి ప్రాపంచికపు మాయలోపడి, స్వార్థం పెరిగి హింసలు చేస్తూ మానవ జన్మ చక్రంలో తిరుగుతుంటాం.

చనిపోయిన తరువాత భౌతిక శరీరాన్ని విడిచి సూక్ష్మ శరీరంతో అంటే జీవాత్మగా పైలోకాలకు వెళ్ళగానే కొంతకాలం సూక్ష్మ లోకాల్లో విశ్రమించి మన భావనాశక్తితో ఎన్నో సృష్టించుకుంటూ ఆనందిస్తాం. అదే స్వర్గం అంటే!

అలా కొంతకాలం గడిచాక ఆ స్వర్గపు జీవితం బోర్ కొడుతుంది. మళ్ళీ భూలోకం రావడానికి మొగ్గు చూపుతాం. ఎందుకంటే స్వర్గలోకంలో ఏదికోరితే అది ప్రత్యక్ష్యం అవుతుంది. కోరినదల్లా ప్రత్యక్షమైతే నిజంగా అది విసుగు పుడుతుంది కదా! అందుకని జీవాత్మలు మళ్ళీ భూలోకం రావాలని నిర్ణయం తీసుకుని, గత జన్మ కర్మరుణాలు ఉన్నవారు, ఇష్టమైనవారు అందరూ కలసి చక్కటి ప్రణాళిక రచించుకొని "కారణలోకాలకు" వెళ్ళి తమ సంచిత కర్మల చిట్టా సరి చూసుకుని, ఈసారి ఎరుకతో జాగ్రత్తగా ఉండాలనే నిర్ణయం తీసుకుని వాటికి సరిసమానమైన కర్మలతో భూలోకంలో "మాస్టర్స్" సహాయంతో అడుగుపెడతాము. వాటినే ప్రారబ్ధ కర్మలు అంటారు. ఉదాహరణకు "రామదాసు" కథను తీసుకుందాం!

రామదాసు అసలు పేరు కంచర్ల గోపన్న. ప్రజల వద్ద డబ్బులు వసూలు చేసి రాజుగారి అనుమతి లేకుండా శ్రీరామునికి దేవాలయం నిర్మించాడు అన్న ఆరోపణలతో తానీషా మహారాజు అతన్ని చెరసాలలో బంధించి శిక్షిస్తూ ఉంటాడు. అతన్ని రక్షించమని సీతాదేవి శ్రీరాముడిని అడుగుతుంది. అప్పుడు

శ్రీరాముడు చిరునవ్వుతో, సీతా అతను గతజన్మలో ఒక పక్షిని పంజరంలో బంధించి దాని స్వేచ్ఛను హరించివేసాడు. ఇప్పుడు దాని ఫలితాన్ని అనుభవిస్తున్నాడు అని చెపుతాడు.

రామదాసు భూలోకంలో జన్మ తీసుకుని రావాలని నిర్ణయం తీసుకుని పైనుండి భూలోకం వచ్చేముందు కారణలోకాల్లో ఉన్న మాస్టర్స్ 'ఎందుకు గతజన్మలో నీవు ఒక పక్షి స్వేచ్ఛను హరించివేశావు' అని తెరమీద ఆ రామచిలుక పడే వేదనను చూపించి అడుగుతారు.

ఒక పక్షికి అత్యంత విలువైనది స్వేచ్ఛ దానిని నీవు హరించివేశావు. ఎందుకు అలా చేశావు? నీవు జ్ఞానివి అయితే అలా చెయ్యవు కదా. నీకు స్వేచ్ఛ విలువైనది అన్న జ్ఞానం లేదు అది రావాలంటే అనుభవం కావాలి. కనుక నీవు భూలోకం వెళుతున్నావు కాబట్టి నిన్ను ఎవరైనా బంధిస్తే ఎలా ఉంటుందో తెలుసుకుని దాన్ని అనుభవ జ్ఞానంగా మలచుకుని తిరిగి రా. ఆ అనుభవ జ్ఞానం వల్ల నీవు ఉన్నతాత్మ అవుతావు. తరువాత జన్మలలో ఎవరికి అటువంటి బాధ కలిగించవు అంటూ సలహా ఇస్తారు.

అందువలన రామదాసు ఒక ప్రణాళిక వేసుకుని జైలు జీవితం అన్న కథను రాసుకుని, తానీషా మహారాజుతో ఒప్పందం కుదుర్చుకుని పైలోకం నుండి భూలోకం వచ్చాడు. దీనినే విధి వ్రాత లేదా తలరాత అంటాము. అయితే తలరాత రాసేది బ్రహ్మదేవుడు కాదు. ఎవరికి వారే, వారి జీవితపు ప్రణాళికను అనుభవం కోసం రాసుకుని వస్తారు.కాకపోతే తల్లి గర్భం లోంచి బయటకు రాగానే అందరం అంతా మరచిపోతాము. అదే "వింత నాటకం" అంటే. కనుక రామదాసు పడే బాధకు కారణం తానీషా మహారాజు కాదు. అతను కేవలం నాటకంలో పాత్రధారి మాత్రమే. అసలు కారణం రామదాసు గతంలో ఒక పక్షి పట్ల చేసిన దుష్కర్మ. అది శుభ్రం చేసుకోవడానికి తానే నిర్ణయించుకొని భూలోకం వచ్చి, అనుభవ జ్ఞానం పొంది తద్వారా ఉన్నతాత్మ అయ్యాడు. అదే రాముడిలో లయమవ్వడమంటే!

"కనుక ఈ లోకంలో మనము అనుభవించే ప్రతీ బాధ ఒకానొకప్పుడు మరొక వ్యక్తికో, ప్రాణికో మనం కల్పించిందే అన్నది సదా గుర్తుంచుకోవాలి."

ఆ హింసను మనం అజ్ఞానపు దశలో వారికి కల్పించాము కనుక తరువాత జన్మలలో మరొక ప్రాణికి అటువంటి బాధను కల్పించకుండా ఉండే జ్ఞానాన్ని సంపాదించుకోవాలంటే అటువంటి బాధనే మనం అనుభవిస్తే ఆ జ్ఞానం ఆత్మక్షేత్రంలో నిక్షిప్తమై తరువాత జన్మలలో ఉన్నత ఆత్మగా పరిణామం చెందుతాము.

"పశువు" దశలో హింసలు చేస్తాము. తిరిగి వాటిని అనుభవించి "పశుపతి"గా మారతాం. అందుకే రోగాలు, బాధలు శిక్షగా భావించవద్దు. శిక్షణగా భావించాలి. "మానవుడు మాధవుడయ్యేది ఈ శిక్షణ వలనే".

***వాసవి:*** మాస్టర్ క్యాన్సర్ జబ్బును కూడా సంతోషంగా తీసుకొని వస్తాం అంటున్నారు మరి జబ్బు అనుభవించేటపుడు ఎందుకు బాధపడుతున్నారు.

***వంశీ మాస్టర్:*** మంచి ప్రశ్న వేశారు వాసవి. మనం కర్మలు ఎంచుకునేప్పుడు ఆత్మస్థితిలో ఉంటాము. అంటే పై లోకాల్లోనుంచి క్రిందకు వచ్చేటప్పు డన్నమాట. దేహంలోకి వచ్చాక ఆ జబ్బు అనుభవించాల్సినపుడు వేదన చెందుతుంటాం. ఆత్మస్థితిలో సంతోషంగా తీసుకుంటాం. కాని దేహస్థితిలో కష్టపడుతుంటాం. కనుక ఎప్పుడు కూడా "నేను దేహము కాదు ఆత్మని" అన్న జ్ఞానంతో ఉండాలి.

నేను దేహం ద్వారా అనుభవిస్తున్న ఈ జబ్బు నాకు ఎంతో నేర్పించడానికి వచ్చింది అన్న అవగాహన పెంచుకుని తరువాత ఆ జబ్బు మీకే ఎందుకొచ్చిందని అన్వేషించండి. దానిని ప్రేమించండి. అపుడు మీకు ఆ జబ్బు నుండి ఉపశమనం లభిస్తుంది.

ఎందుకంటే "ప్రేమించేది ఏదీ మిమ్మల్ని బాధించదు".

కనుక కష్టాల్ని, బాధల్ని మనం ఎంతగా ద్వేషిస్తే, దానికి ఎంత భయపడితే అది అంతగా మనల్ని హింసిస్తుంది. ఎందుకు ఈ గోలంతా అంటే అనుభవ జ్ఞానం రావాలి కదా మరి.

## దేవుళ్ళు, బాబాలు రక్షించరా?

***జానకి:*** మాష్టర్ దేవుళ్ళు, బాబాలు, గురువులు 'రక్షిస్తారు' అంటారు కదా! అందులో ఎంతవరకు వాస్తవం ఉంది?

***వంశీ మాష్టర్:*** "శిక్ష" ఉంటేనే కదా "రక్షణ" కావాలి. ఇక్కడ శిక్షే లేదు ఇంక రక్షణకు తావెక్కడిది. అయినా పైనున్న పరమాత్ముడు భయంకరమైన జబ్బులు మనకి ఊరకనే అంటగట్టి మనం బాధపడుతుంటే లీలావినోదం చేసుకునే కిరాతకుడు కాదు. క్రిందనున్న దేవుళ్ళు, బాబాలు మనల్ని రక్షించడమే పనిగా పెట్టుకున్న పనివాళ్ళు కాదు. అందరూ సాక్షిగా మనల్ని గమనిస్తూ ఉంటారు. మనం ఈ "శిక్ష వంటి శిక్షణ" ద్వారా అనుభవ జ్ఞానం సంపాదించి, ఉన్నతాత్మగా ఎదగాలని కోరుకుంటూ ఉంటారు. దానికి కావలసిన మార్గాలు, అవకాశాలు అన్నీ మనకు కల్పిస్తూ ఉంటారు. కాని మనం కళ్ళు ఉన్న గుడ్డివాళ్ళం కదా! గమనించలేము మరి అపుడే "ధ్యానం చేస్తే ఆ కళ్ళు సంపూర్ణంగా వికసిస్తాయి". అంతా అర్థం అవుతుంది.

హింస మనమే చేస్తున్నాం. తద్వారా ఫలితాన్ని మనమే అనుభవి–స్తున్నాము. ఇది ఎంతవరకు అంటే తిరిగి మళ్ళీ హింస చెయ్యకుండా ఉండే జ్ఞానం వచ్చేంతవరకు. కాబట్టి ఇందులో దేవుళ్ళకు, బాబాలకి, గురువులకి ఏ సంబంధం ఉంటుంది?

మనం చేసిన గత కాలపు హింసలన్నీ వారికి చెప్పి చేశామా!

ఒకవేళ వాళ్ళు సహాయం చేసినా మీ బాధని తరువాత జన్మకి వాయిదా వేసి మీ బరువు కొంత తగ్గిస్తారే తప్ప రద్దు చేయడం ఉండదు. అది సృష్టి నియమాలకు విరుద్ధం. పాసైయ్యేంతవరకు పరీక్ష రాయవలసిందే అన్నది ఎంత నిజమో, "మానవుడు మాధవుడయ్యేంత" వరకు జన్మలు ఎత్తాల్సిందే అన్నది కూడా అంతే నిజం. ఇదే "కర్మచక్రం" అంటే.

# అసలు భూమి మీద జన్మ ఎందుకు?

***సునీల్:*** మాష్టర్ జన్మ తీసుకుంటేనే కదా కర్మలు అనుభవించవలసింది. భూమి మీదకు రాకపోతే గొడవేలేదు కదా?

***వంశీ మాష్టర్:*** అవును సునీల్, నీవు ప్రయోజకుడివి కావాలనుకున్నప్పుడే కదా స్కూల్‌కు వెళ్ళేది, కష్టాలు పడేది, పరీక్షలు రాసేది, ఆనక గొప్పవారు అయ్యేది. జీవితంలో ఎదగాలి అనుకోకపోతే ఏ పరీక్షలు, ఏ చదువులూ, ఏ కష్టాలూ ఉండవు. ఎంచక్క గాలికి తిరుగుతూ ఉండవచ్చు. కాకపోతే ఎదుగూ, బొదుగూ లేని జీవితం గడపాలి.

అదే విధంగా 'ఉన్నతాత్మ' అవ్వాలంటే భూలోకం వచ్చి జన్మలు తీసుకుని తద్వారా అనుభవజ్ఞానం పొందాల్సిందే! ఎందుకంటే 'అనుభవ జ్ఞానమే అసలైన జ్ఞానం' కనుక. మీరు భూలోకం రాకుండా సూక్ష్మలోకాల్లో ఉండిపోవచ్చు. మిమ్మల్ని ఎవ్వరూ బలవంతంపెట్టరు. కాకపోతే ఎంత కాలమైనా 'శైశవాత్మ'గానే ఉండిపోతారే తప్ప వృద్ధాత్మ అయ్యే ఛాన్స్ లేదు. 'జ్ఞానం' అన్న ప్రశక్తి లేదు. ఆత్మజ్ఞానం లేని ఆత్మతకు ఉన్న లోకాలు నుండి ఉన్నత లోకాలకు వెళ్ళడానికి వీసా దొరకదు. నిజానికి 100లో 10% ఆత్మలే. భూలోకం రావడానికి ధైర్యం చేస్తాయి. అలా ఎన్నో జన్మలు ఎత్తి ఉన్నతాత్మగా మారినవారికి మాత్రమే సత్యలోకాలకు వెళ్ళే అర్హత వస్తుంది. మిగతావారు ఎన్ని వేల సంవత్సరాలైనా అలా ఉండిపోవాల్సిందే! కనుక భూలోకంలో బాధలు కష్టాలు అనుభవించడానికి వచ్చిన పాపాత్ములం కాదు మనం.

మానవుడి స్థాయి నుండి మాధవుడిగా ఎదగడానికి శైశవాత్మ నుండి వృద్ధాత్మగా మారడానికి 'దిగివచ్చిన వీరులం' మనం!

# కర్మచక్రానికి అంతం ఎక్కడ?

***శ్రీదేవి:*** మాష్టర్ మీరు చెప్పినట్లు 'నన్ను ఎవరైనా అకారణంగా హింసిస్తున్నారంటే' గతంలో వారిని 'నేను హింసించానని' అర్థం అన్నారు. 'ఆ జన్మలో నేను వారిని హింసించాను' అంటే అంతకుముందు జన్మలలో వారు నన్ను హింసించారనే కదా అర్థం. ఒకసారి వాళ్ళు ఒకసారి నేను ఇలా దీనికి అంతం ఎక్కడ?

***వంశీ మాష్టర్:*** నిజమే మీరు చెప్పింది. ద్వేషం చల్లారనంత వరకు పాత్రలు మారుతూనే ఉంటాయే తప్ప కర్మచక్రం పూర్తి కాదు. ఎవరన్నా మిమ్మల్ని హింసించారనుకోండి, సహజంగా వారిపై మీరు ద్వేషం కలిగి ఉంటారు. తరువాత జన్మలో కత్తి మీ చేతికి అందించబడుతుంది. ఇలా ఒకసారి మీకు, ఒకసారి వాళ్ళకు దేవాత్మలు అవకాశాలు ఇస్తుంటారు. దీనికి అంతం ఎక్కడ అంటే "వారిపై దాష్టికం చేసే అవకాశాలు మీకు వచ్చినా మీరు వారిని క్షమించి వేస్తే వారికి మీకు గల కర్మచక్రం రద్దు అవుతుంది". అంటే మీ శత్రువుని మీరు క్షమించగలిగితే తరువాత జన్మలలో వారికి మీకు ఎటువంటి కర్మబంధమూ ఉండదు. లేదంటే కర్మచక్రంలో పడి తిరగవలసిందే. కాకపోతే ఒకసారి అవకాశం వారికి, ఒకసారి మీకు. అందుకే "జీసస్" తనను

దారుణంగా శిలువేసిన వారిని క్షమించి కర్మచక్రం నుండి ముక్తి పొందాడు. కనుక "కర్మ చక్రానికి అంతం క్షమ అడగడం లేదా క్షమ ఇవ్వడం''.

***సువర్ణ:*** మాష్టర్ గత జన్మలో చేసిన పాపాలు ఈ జన్మలో అనుభవిస్తాం అంటున్నారు కదా! అదే విధంగా ఈ జన్మలో చేసింది వచ్చే జన్మలోనా? లేక ఇప్పుడే అనుభవించాలా? అసలు కర్మకి, అనుభవానికి మధ్య ఎంతకాలం వుంటుంది?

***వంశీ మాష్టర్:*** ఇంతకాలం అని ఖచ్చితంగా చెప్పలేం. అందుకే మనం అనుభవిస్తున్న బాధ లేక భోగం 'గతం' లేదా 'గత జన్మది' అంటారు.

మరొక ప్రాణి పైన మీరు ఇప్పుడు చేసే హింస, తరువాత జన్మలలో లేదా వెంటనే ఎదుర్కోవలసి రావచ్చు. అది వారి వారి "ఆత్మస్థితిని" బట్టి కేటాయించబడుతుంది. కనుక సదా ఎరుకలో ఉండడమే మనం చెయ్యవలసింది.

"ఇప్పుడు నేను అనుభవిస్తున్న ఈ బాధలు ఒకప్పుడు ఎవరికో నేను కల్పించినవే. కనుక ఇకపై ఎవరినీ, ఏ ప్రాణినీ బాధించకూడదు," అన్న జ్ఞానాన్ని, ఎరుకను మనం పెంచుకుంటే అంతా అదే సర్దుకుంటుంది.

# పైనున్న మాస్టర్స్ ఎందుకు చెప్పరు?

***భవాని :*** మాష్టర్ ఎప్పుడోచేసిన సంచితకర్మలు ఇప్పుడు అనుభవిస్తున్నాం కదా. నీవు అనుభవిస్తున్న ఈ బాధ ఒకప్పుడు నీవు చేసిన ఫలానా హింసే కారణమని పైనున్న మాష్టర్స్ దానిని మనకు ఎందుకు తెల్పరు? మనం అనుభవిస్తున్న బాధలకు 'ఇదీ కారణం' అని చెపితే మనలో మార్పు వస్తుంది కదా?

***వంశీ మాష్టర్ :*** ఎందుకు చెప్పడం లేదు. ఎన్నోసార్లు మిమ్మల్ని ఆధ్యాత్మిక మార్గంలోకి మళ్ళించడానికీ మీ చేత "ధ్యానం" చేయించడానికీ, హింస మాన్పించడానికి దేవాత్మలు ఎంతో మంది సహాయకులు ద్వారా సంఘటనల ద్వారా ఎన్నోసార్లు ప్రయత్నిస్తారు, కానీ మనం వింటేనా?

పైలోకంలోని మాష్టర్స్ మీకు ఫోన్ చేసి చెపుతారు అనుకుంటున్నారా? ఒక వేళ చెప్పినా మీరు నిజంగా నమ్ముతారా?

సాక్షాత్తు పరమాత్ముడు దిగివచ్చి చెప్పినా నిజమైన పరమాత్ముడా కాదా అన్న సందేహంలో ఉంటాము తప్ప మనం వినం" నేను ఒక కథ విన్నాను.

ఒకప్పుడు అమరావతిలో ఒక హరిభక్తుడు నివసిస్తూ ఉండేవాడు. అతను ఎన్నెన్నో కఠినమైన ఉపవాసాలు, పూజలు చేసి గొప్ప భక్తుడన్న పేరు తెచ్చుకున్నాడు. ఒకసారి ఆ గ్రామానికి ప్రక్కనే ఉన్న కృష్ణానది పొంగి వరద ముంచుకొచ్చింది. అందరూ ఊరు విడిచి వెళ్లిపోయారు. ఈ హరి భక్తుడు మాత్రం 'హరి వచ్చి రక్షిస్తాడు' అని శ్రీహరిని బిగ్గరగా స్మరించుకుంటూ అరుగుపై కూర్చుని వుంటాడు. అంతలో ఒక యువకుడు వచ్చి "స్వామీ రండి, ఇంకొంతసేపటికి వరదనీరు ఊరిని ముంచేస్తుంది. నా సైకిలు పై ఎక్కించుకొని మిమ్మల్ని తీసుకువెళతాను" అని ఎంతో గౌరవంగా అడుగు–తాడు. వెంటనే ఆ పరమభక్తుడు, "నేను రాను నాయనా, ఆ శ్రీహరే నాకోసం స్వయంగా వస్తాడు అంటూ శ్రీహరి జపాన్ని మరింత బిగ్గరగా జపిస్తాడు. విసుగుపుట్టిన ఆ యువకుడు వెళ్ళిపోతాడు. తరువాత కొంతసేపటికి వరద నీరు ఊరిలోకి ప్రవేశిస్తుంది. ఇళ్ళన్నీ సగం వరకూ మునిగిపోతాయి. అప్పుడు పడవవేసుకొని ఆలయ ధర్మకర్త వచ్చి ఆ హరిభక్తుడిని తన వెంట రమ్మంటాడు. అప్పుడు కూడా వెళ్లటానికి తిరస్కరిస్తాడు. వరద మరింత ఉధృతం అవుతుంది. అప్పుడా భక్తుడు ఇంటిపైన కూర్చుని శ్రీహరికి మరింత భక్తిగా, మరింత తీవ్రంగా ప్రార్థన చేస్తుంటాడు. ఊరంతా నీటిలో మునిగి పోయి ఉంటుంది. ఆఖరి ప్రయత్నంగా హెలికాప్టర్‌లో అధికారులు వచ్చి తాడు క్రిందకు వదలి అతన్ని ఎక్కి పైకి రమ్మని అంటారు. నా శ్రీహరి వస్తేనే నేను వచ్చేది. లేకపోతే రాను," అని ఖరాకండిగా చెపుతాడు. వారు కూడా వెనుతిరిగిపోతారు. వరద నీటి ఉధృతికి ఇల్లు కూలిపోయి ఆ శ్రీహరి భక్తుడు మరణిస్తాడు.

మరణించిన ఆ భక్తుడు తిన్నగా వైకుంఠం వెళ్ళి శేషతల్పంపై వున్న ఆ విష్ణుమూర్తిని ప్రశ్నిస్తాడు?

స్వామీ నీకు ఎన్నో పూజలు చేసాను, ఎన్నో ఆలయాలు కట్టించాను, ఎందుకు నన్ను కాపాడటానికి రాలేదు అంటూ నిష్ఠూరమాడతాడు.

శ్రీహరి చిద్విలాసంతో, "భక్త నేను ఎందుకు రాలేదు? సైకిల్‌పై వచ్చాను, పడవ వేసుకొని వచ్చాను, చివరకు హెలికాప్టర్ కూడా వేసుకొని వచ్చాను. నీవు కళ్ళున్న గుడ్డివాడవు. నీవు నన్ను గుర్తించలేదు" అంటాడు.

బాగా గుర్తుంచుకోండి, ఏ భగవంతుడూ మీరు అనుకున్నట్లు, సినిమాలో చూపించినట్లు కేజీల కొద్దీ నగలు, కిరీటాలు ధరించి ఆకాశంలోంచి రాడు, ప్రకృతి ద్వారా, పక్కవారి ద్వారా, 'స్వప్నాలు' ద్వారా ఎప్పుడూ మీకు సంకేతాలు అందచేస్తూ ఉంటాడు.

మీరు అనుభవిస్తున్న ఈ కష్టం,ఈ రోగం, ఈ బాధ మీరు ఫలానా అప్పుడు ఫలాన వారికి చేసారంటూ మెసేజ్‌లు అందిస్తుంటారు. "మీ వాస్తవానికి మీరే సృష్టికర్తలు"అని చెప్పడానికి మీ జీవితంలోకి మాష్టర్స్ ఎవరినో ఒకరిని పంపిస్తూనే ఉంటారు. అంతెందుకు "మీరు ఈ పుస్తకాన్ని చదువుతున్నారు అంటే అది కూడా మాష్టర్స్ మీలో మార్పు తేవడానికి వేసిన ప్రణాళికలో భాగమే." అందుకే మీ చుట్టూ జరుగుతున్న సంఘటలను బాగా గమనించండి. ప్రతీ క్షణం అప్రమత్తతో ఉండండి. మిమ్మల్ని ఉన్నతాత్మగా మార్చడానికి, మీ శిక్షణ తొందరగా పూర్తి చేసుకోవడానికి ప్రకృతి అనుక్షణం పరితపిస్తుంది అన్న విషయం ఖచ్చితంగా గుర్తుంచుకోండి. ధ్యానం బాగా చెయ్యండి. అప్పుడే మాష్టర్స్ సందేశాలు అర్థమౌతాయి.

***వాసవి:*** మాష్టర్ మా అత్తగారికి కాన్సర్ వచ్చింది. దానికి కారణం ఏమిటో నేను ధ్యానం చేసిచూడచ్చా?

***వంశీ మాష్టర్:*** మీరు తెలుసుకుని ఏం ప్రయోజనం? మీరు ధ్యానం చేస్తే ఆమెకు జ్ఞానం ఎలా కలుగుతుంది? మీరు తింటే ఆమె ఆకలి తీరుతుందా? అయినా ఇది అంతా ఆమె నమ్ముతుందా? తనకు అనుభవం అయితే తప్ప నమ్మలేదు. ఇలా ఎన్నో బాధలు అనుభవించిన పిదప ఆమె ఏదో ఒకరోజు అన్వేషణ మొదలుపెడుతుంది. అప్పుడే ఆమె తెలుసుకోగలుగుతుంది. కనుక తన కర్మకు కారణం తనే అని ఆమె స్వయంగా ధాన్యంచేసి తెలుసుకోవాలి. "స్వ అనుభవమే అసలైన జ్ఞానం".

## కర్మలు తప్పించుకోలేమా?

***సుకన్య:*** మాష్టర్ మనం అనుభవిస్తున్న బాధలు తప్పించుకోలేమా? ఖచ్చితంగా అనుభవించి తీరవలసిందేనా?

***వంశీ మాష్టర్:*** బాధలు ఎలా తప్పించుకోవాలని అన్నదానిమీద నుండి దృష్టి మరల్చి, మనమే ఈ బాధలను ఎందుకు అనుభవించాల్సి వస్తుందని ఆలోచించండి.

ఎందుకంటే... గతంలో ఇటువంటి బాధలను మరొకరికి కల్పించాం కాబట్టి!!

ఎందుకు కల్పించామంటే... ఆ జన్మలో మనకు 'జ్ఞానం' లేదు కాబట్టి!!

జ్ఞానం లేని ఆ దశలో మనం ఇతర ప్రాణుల పట్ల చేసిన హింసలు మరి తరువాత జన్మలలో చేయకుండా ఉండడం కోసం, మనం బాధల రూపంలో, గత కాలపు పాపకర్మల అనుభవిస్తున్నాము. కనుక మీరు అనుభవిస్తున్నది గతంలో 'ఎవరికి, ఎందుకు కల్పించారో తెల్సుకుని, పశ్చాత్తాపాన్ని పొంది, ఇంకెప్పుడు ఇటువంటి హింసను చేయకూడదన్న జ్ఞానాన్ని పొంది, ఆ విధంగా "ప్రవర్తిస్తుంటే" ఆ కర్మ అక్కడితో పూర్తి అయిపోతుంది.

జ్ఞానం వచ్చినప్పుడు శిక్షణతో పనిలేదు కదా! దీనినే కృష్ణభగవానుడు "జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం" అని వేల సంవత్సరాల క్రితమే చెప్పాడు.

## "జ్ఞానాగ్ని" అంటే?

***సంధ్య:*** మాష్టర్ 'జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం' అంటే ఏమిటి? వివరంగా చెప్పండి?

***వంశీ మాష్టర్:*** మీ ఇంట్లో మీ పిల్లవాడు 100 రూపాయలు దొంగతనం చేసి స్నేహితులతో సినిమాకు వెళ్ళాడనుకోండి, ఆ విషయం తెలిసిన మీరు వాడిని శిక్షించి మంచి దారిలో పెట్టాలని నిర్ణయించుకుంటారు. వాడు తిరిగి వచ్చాక, మీరు వెంటనే వాడిని నిలదీసి నిన్ను ఎంతగా నమ్మాను? నన్ను మోసం చేస్తావా? అంటూ కర్రతో నాలుగు దెబ్బలు వేశారు. వాడు సిగ్గుపడి తన తప్పు తెలుసుకొని, 'అమ్మా నన్ను మన్నించు, ఇదిగో మిగిలిన 50 రూపాయలు ఇంకెప్పుడూ ఇటువంటి తప్పు చెయ్యను' అంటూ క్షమాపణ కోరుకున్నాడు.

అప్పుడు మీరు ఏం చేస్తారు. ఇంకా దండిస్తారా? క్షమించి వదిలేస్తారా?

ఖచ్చితంగా ఎవరూ ఇంక కొట్టరు. ఎందుకంటే పిల్లవాడు తన తప్పు తాను తెలుసుకున్నాడు. వాడికి విధించబడ్డ మిగిలిన దెబ్బలు వాడికి వచ్చిన జ్ఞానంతో రద్దుచేయబడ్డాయి. "ఇదే జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం అంటే". తప్పు చేసి పశ్చాత్తాపము పొందిన బిడ్డని ఎలా అయితే మనం క్షమిస్తామో, అదే

విధంగా పరమాత్మ బిడ్డలమైన మనం గతంలో చేసిన హింసాకాండను ధ్యానం ద్వారా చూసుకొని "నా వాస్తవానికి నేనే సృష్టికర్తను" గతంలో వేరొకరికి పెట్టిన హింసనే నేను ఇప్పుడు అనుభవిస్తున్నాను అన్న జ్ఞానం తెచ్చుకుంటే, దానిని కర్మదేవతలు నిశ్చయం చేసుకుంటే మనకు విధించబడ్డ కర్మలు రద్దు చేయబడతాయి. జ్ఞానమనే అగ్నిలో మన దుష్కర్మలన్నీ మండిపోతాయి. ఇదే 'కర్మసిద్ధాంతం' అంటే. మన గతకాలపు దుష్కర్మలను చూసుకొని దగ్ధంచేసుకొనే సులువైన పద్ధతి ఉంది. అదే 'కర్మధ్యానం'.

## 'కర్మధ్యానం'

***శ్రీదేవి:*** కర్మధ్యానమా! చాలా కొత్తగా ఉంది. దీని గురించి వివరంగా చెప్పండి?

***వంశీ మాష్టర్:*** ఇది కొత్తదేమీ కాదు. కృష్ణ భగవానుడు చెప్పిందే. కాకపోతే దానిని మరింత సుళవుగా నేను వివరిస్తున్నాను అంతే. కర్మప్రక్షాళన కోసం "ధ్యానం" చేస్తున్నాం. కనుక దానిని కర్మధ్యానం అంటారు.

ముందుగా మీ జీవితంలో మీరు అనుభవిస్తున్న బాధలు అన్నింటినీ ఒకసారి పరిశీలించుకోండి. అందులో తీవ్రమైనది ఏదో దాన్ని గుర్తించండి. తరువాత తెల్లవారుజామున మూడుగంటలకు లేవండి. అక్కడే కళ్ళు మూసుకొని కూర్చోండి. కాసేపు శ్వాసను గమనిస్తూ ధ్యానం చెయ్యండి. మనస్సు శూన్యం అయ్యాక, ఇతర ఆలోచనలన్నీ ఆగిపోయాక కళ్ళు తెరవకుండా మనస్సులోనే ఇలా సంకల్పం చెప్పుకోండి.

"మాష్టర్స్ నేను ఈ బాధను అనుభవిస్తున్నానంటే గతంలో ఎవరికో ఇటువంటి బాధనే కల్పించాను. దయచేసి దానిని నాకు చూపించండి" అని మూడుసార్లు ఆర్తిగా, పూర్తి అంకితభావంతో మనస్సులో అనుకోండి. తరువాత కాసేపు కళ్ళు తెరవకుండానే ధ్యానం కొనసాగించండి. కొంతసేపటికి నిద్ర వస్తుంది. హాయిగా పడుకొని నిద్రపోండి. ఆ యోగ నిద్రలో మీకు చక్కటి "స్వప్న సందేశం" వస్తుంది. గతంలో లేదా గత జన్మలలో మీరు వేరొకరికి కల్పించిన బాధ మీకు స్పష్టమైన స్వప్నంగా కన్పిస్తుంది. ఈ సందేశం ఒక్క రోజులో రావచ్చు లేదా కొన్ని రోజులు పట్టవచ్చు. ఓపిగ్గా చేస్తూ ఉండండి.

ఆ స్వప్న సందేశం వచ్చిన తరువాత మీరు పూర్తి నిజాయితీతో గతంలో మీరు దాష్టీకం చేసిన వ్యక్తికి లేదా ప్రాణికి ఎప్పుడైనా ధ్యానంలో కూర్చొని

క్షమాపణ చెప్పుకోండి. మీ బాధలకు కారణం గతంలో చేసిన దుష్కర్మేనని ప్రతిక్షణం ఏరుకలో ఉంచుకోండి. తప్పుచేసి దండన ఎదుర్కొంటున్న పిల్లవాడు తన తప్పుని తెలుసుకొని క్షమాపణ కోరితే, వాడి మిగిలిన దండన ఎలాగైతే మనం రద్దు చేస్తామో అదేవిధంగా పరమాత్ముడు కూడా మన మిగిలిన కర్మను రద్దుచేస్తాడు. ఎందుకంటే 'జ్ఞానం' వచ్చింది కదా మరి ఇక శిక్షణతో పనిలేదు.

ఇదే"జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం" అంటే

జ్ఞానమనే అగ్నిలోనే మన కర్మదగ్ధం అవుతుంది.

"జ్ఞానము" అంటే మనం గతజన్మలలో వేరొకరికి కల్పించిన బాధని ధ్యానం ద్వారా లేదా స్వప్నం ద్వారా చూసి, ఈ జన్మలో నా బాధకు 'నేనే కారణం' అని తెలుసుకోవడం.

'అగ్ని' అంటే తీవ్రత. మనం గతకాలంలో వేరొకరికి కల్పించిన బాధను ధ్యానం ద్వారా చూసి తీవ్రంగా స్పందించడం. సంపూర్ణమైన వేదనతో మన ద్వారా హింసకు గురైన ప్రాణికి, సృష్టికి హృదయపూర్వకంగా క్షమాపణ కోరడం.

"దగ్ధకర్మాణం"అంటే ధ్యానం ద్వారా, లేదా స్వప్నం ద్వారా తెలుసుకున్న మన గతకాలపు హింసాత్మక ప్రవర్తన గుర్తించి, మనవలన బాధకు గురి అయిన ప్రాణికి, క్షమాపణ చెప్పినప్పుడు ఆ అగ్నిలో ఆ "పరివర్తన"లో మనం అనుభవిస్తున్న దుష్కర్మ దగ్ధం అవుతుంది.

***తులసి:*** మాష్టర్ మన అనారోగ్యాన్ని నయం చేసుకోవడం ఇంత సులభమా? ఎంత అద్భుతంగా ఉంది! దయచేసి కర్మధ్యానం ద్వారా అనారోగ్యాలు నయం చేసుకున్న వారి అనుభవాలు చెప్పండి?

***వంశీ మాష్టర్:*** మనకి తెలియనంత వరకు ఏదయినా కష్టంగానే ఉంటుంది. తెలుసుకొని ఆచరించి, అనుభవం పొందితే అది ఎంతో సులువుగా అనిపిస్తుంది.

ఒక వ్యక్తి అనుభవం మీకు చెపుతాను.

విశాఖపట్టణంలో గంగవరం ప్రాంతంలో రమేష్ అనే ఒక యువకుడు ఉన్నాడు. అతనికి ఉబ్బసం వ్యాధి ఉండేది. చలికాలంలో ఎంతో బాధపడుతూ

ఉండేవాడు. అతను నావద్దకు కౌన్సిలింగ్ కొరకు వచ్చాడు. ఎందువలన ఈ ఉబ్బసం వ్యాధి వచ్చింది అని అడిగాను. దానికి అతను మేము సముద్రం దగ్గరలో ఉన్నాము, ఆ గాలి పీల్చడం వలన ఈ వ్యాధి వచ్చింది' అన్నాడు. నేనన్నాను 'మీ ఇంటిలో మీ అమ్మ, మీ నాన్న కూడా అదే గాలి పీలుస్తున్నారు కదా! మరి వారికి కూడా ఈ వ్యాధి ఉందా అని ప్రశ్నించాను.

లేదు మాష్టర్ ఈ వ్యాధి చిన్న పిల్లలకు మాత్రమే వస్తుందట అన్నాడు. అయితే మీ తమ్ముడు నీకన్నా చిన్నవాడు కదా! మరి అతనికి లేదు కదా అని తిరిగి ప్రశ్నించాను.

నా ప్రశ్నలకు అతనికి విసుగుపుట్టి 'అంతా నా కర్మ' అంటూ నసిగాడు. అపుడు నేనన్నాను అదే ఖాయం చేసుకో...." అని

అతను అదేంటి మాష్టర్ అలా అన్నారు. నేనేమో మాటవరసకు నా కర్మ అన్నాను. మీరేమో ఖాయం చేసుకోమంటున్నారు. ఎందుకని అన్నాడు. నీ మాటలు అక్షరాలా సత్యం. ఎందుకంటే ఏ రోగానికైనా కారణం నీ గతజన్మపు కర్మలు. నీ గతజన్మలో ఎవరినో బాధ పెట్టావు. అందుకే ఈ జన్మలో ఈ బాధను అనుభవిస్తున్నావు. అదేంటో తెలుసుకో అన్నాను.

గత జన్మ కర్మలా? అవి ఎలా తెలుసుకోవాలి మాష్టర్, నాకు చెప్పండి అన్నాడు.

క్రమం తప్పకుండా 40 రోజులు కర్మధ్యానం చెయ్యాలి అని చెప్పి, చేసే పద్ధతి చెప్పాను.

అతను ఆ రోజు నుండి నేను చెప్పినట్లే పొద్దునే 3గం॥లకు నిద్రలేచి సిన్సియర్‌గా ధ్యానం చెయ్యడం మొదలుపెట్టాడు. 'మాష్టర్స్ నా వ్యాధికి గల కారణం ఏమిటో, నేను ఎవరిని హింసించానో నాకు తెలియచెయ్యండి' అని మనస్సులో సంకల్పించి ధ్యానం చెయ్యడం మొదలుపెట్టాడు.

ఇలా ప్రతిరోజూ చెయ్యగా, 8వ రోజు అతనికి ఒక "స్వప్న సందేశం" వచ్చింది. అది ఏమిటంటే ఒక జింకను ముక్కూ, మూతి నొక్కి పెట్టి దానికి ఊపిరి అందకుండా చంపినట్లు చాలా చక్కగా, స్పష్టంగా కన్పించి వెంటనే అతనికి మెలకువ వచ్చిందట. అతను మళ్ళీ ధ్యానంలో కూర్చుని పూర్తి ఆర్తితో, ఆర్ద్రతతో తాను హింసించిన ఆ జీవానికి 11 రోజుల పాటు క్షమాపణ చెప్పుకున్నాడు. ఇది జరిగిన కొంత కాలానికి అతనికి ఉబ్బసం వ్యాధి

క్రమక్రమంగా తగ్గిపోయింది.

అసలు జరిగిందేమంటే, రమేష్ జన్మ తీసుకోవడానికి ముందు,అతని జీవాత్మ కారణలోకానికి వెళుతుంది. అక్కడ ఉన్న మాష్టర్స్ గత జన్మలో అతను ఒక జింకను ఊపిరి అందకుండా చేసి చంపిన సంఘటనను చూపించి దానిపై వివరణ కోరతారు.

నీవు ఎందుకు ఒక ప్రాణిని, ఇంత దారుణంగా ఊపిరి ఆపి చంపావు. ఇలా చేసావంటే నీకు 'ఊపిరి విలువ తెలియదు'. అని అర్థం అవుతుంది. కనుక నీవు ఊపిరి విలువ తెలుసుకొంటే ఎప్పటికీ, ఎవ్వరినీ ఇలాంటి భాదకు గురి చెయ్యవు.

అందువలన నీకు "ఊపిరి విలువైనది" అన్న జ్ఞానం రావాలంటే, ఊపిరికి సంబంధించిన బాధను అనుభవించాలి. అప్పుడే నీకు ఆ అనుభవ జ్ఞానం ద్వారా 'ఊపిరి విలువైనది' అన్న విషయం తెలుస్తుంది. కాబట్టి ఇప్పుడు నీవు భూలోకంలో జన్మ తీసుకుంటున్నావు కదా! ఉబ్బసం వ్యాధి తీసుకొని వెళ్ళు. ఆ వ్యాధి అనుభవిస్తున్నప్పుడు నీకు 'శ్వాస విలువ' తెలుస్తుంది, అని సలహా ఇస్తారు.

అందుచేత రమేష్ యొక్క జీవాత్మ ఊపిరి విలువైనది అన్న అనుభవ జ్ఞానం పొందడం కోసం ఉబ్బసం వ్యాధిని "సంతోషంగా" తీసుకుని భూలోకంలో రమేష్‌గా జన్మ తీసుకుంది. ఈ ఎంపికలో పూర్తి స్వేచ్ఛ ప్రతీ ఆత్మకు ఇవ్వబడుతుంది. అందుకే 'కర్మశిక్ష కాదు శిక్షణ' అన్నది.

రమేష్ ధ్యానం ద్వారా తన వ్యాధికి కారణం తెలుసుకుని 'ఇంక నేను ఏ జీవినీ హింసించను' అని ప్రకృతికి, మాష్టర్స్‌కి క్షమాపణ చెప్పడం, 'మాంసాహారం' సైతం మాని వేసి సర్వప్రాణి కోటితో స్నేహంగా ఉండడం వలన అతనికి జ్ఞానం వచ్చింది అన్న విషయం ప్రకృతి నిశ్చయం చేసుకుంటుంది.

అందుచేత అతను మిగిలిన రోజులు అనుభవించవలసిన ఉబ్బసం వ్యాధి అన్న శిక్షణ రద్దుచేయబడింది.

ఇదే జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం అంటే.

# కర్మ ధ్యానం చేసినవారి అనుభవాలు

***ప్రసాద్:*** మాష్టర్ వ్యాధులను ఏ మందులూ వాడకుండా నయం చేసుకునే ఈ కర్మధ్యానం ఎంతో అద్భుతంగా ఉంది. సంకల్పం చెప్పడానికి ఏదన్నా విధానం ఉందా, క్రతువు ఉందా మంత్రం చెప్పాలా?

***వంశీ మాష్టర్:*** ఏమీ అవసరం లేదు. తెల్లవారుజామున 3గం॥లకు నిద్రలేచి కాసేపు ధ్యానంచేసి కళ్ళుతెరవకుండా ఆ ధ్యానస్థితిలోనే మాష్టర్స్‌కి ప్రశ్నవేయండి. నేను అనుభవిస్తున్న ఈ బాధ ఒకప్పుడు ఎవరికో నేను కల్పించాను, దయచేసి దానిని చూపించండి అని ఆర్తిగా, ప్రేమగా, నిజాయితీగా అడగండి. తరువాత కాసేపు ధ్యానం చేసి నిద్రపోండి. మీరు ఏ భాషలోనైనా, ఏ పదజాలంలోనైనా సరే మీరు అడిగింది పైవారికి అర్థం అవుతుంది. మీబిడ్డ ఏడుస్తూ మీ వద్దకు వచ్చినపుడు ఆకలితోనా, గాయంతోనా, నిద్ర వచ్చా? అన్న విషయం మీకు అర్థం అవుతుంది కదా. అలా మీ బిడ్డ మనస్సు మీకు తెలిసినట్లు మన మనస్సు కూడా పరమాత్మడికి అర్థం అవుతుంది.

అయితే కావల్సిందల్లా 'నా బాధకు నేనే కారణం' అన్న అవగాహన మాత్రమే!

***కళ్యాణి:*** మాష్టర్ కర్మధ్యానం తెల్లవారుజామునే ఎందుకు చెయ్యాలి?

***వంశీ మాష్టర్:*** ఎందుకంటే అప్పుడే మీ శరీరం సేద తీరి ఉంటుంది. అపుడే మీరు ఆలోచనారహిత స్థితికి దగ్గరగా ఉంటారు. అపుడే మీ మనోనేత్రం విప్పార్చితమై ఉంటుంది. అప్పుడు నిద్రలేచి ధ్యానం చేసి పోయే నిద్ర యోగ నిద్ర అవుతుంది. అందుకే చాలామందికి బాబాలు, గురువులు, మాష్టర్స్ తెల్లవారుజామునే స్వప్న దర్శనాలు ఇస్తుంటారు.

***మల్లి:*** ఈ కర్మధ్యానం చెయ్యడానికి ఏదైనా అర్హత ఉందా? మడి ఆచారాలు ఉన్నాయా? స్నానం చేసి చెయ్యాలా?

***వంశీ మాష్టర్:*** ఏమీ అవసరం లేదని ఇందాకే చెప్పాను కదా' మీరు నిద్రలేచి మంచం మీదే కూర్చుని, కళ్ళు తెరవకుండా 'శ్వాసను గమనిస్తూ' ఉంచి కాసేపు ధ్యానం చేసి 3 మార్లు ప్రశ్న వేసుకుని తరువాత కళ్ళు తెరవకుండానే

ధ్యానం చేసి నిద్రపోవాలి. ఆ నిద్రలో మీకు థర్డ్ఐ విజన్ (Third Eye Vision) అనుభవం వస్తుంది. దీనికి కావలసినది ఓర్పు, నమ్మకం మాత్రమే. నమ్మకంతో ప్రతిరోజూ చెయ్యండి, ఓర్పుగా ఎదురు చూడండి. మీకు పైనుండి సమాధానం వస్తుంది.

***సువర్ణ:*** మాష్టర్ ఎన్ని రోజులు చెయ్యాలి. ఎప్పుడు స్వప్న సందేశం వస్తుంది?

***వంశీ మాష్టర్:*** 'ఇన్ని రోజులకు వస్తుంది' అని చెప్పలేం. ఎందుకంటే ఒకొక్కరికి ఎనర్జీ లెవల్స్ ఒక్కోలా ఉంటాయి. కనుక ఏది ఏమయినా ఓర్పుగా, నమ్మకంతో, శ్రద్ధగా ప్రతిరోజు చేస్తే 40 రోజులలోగా వస్తుంది.

***వాసవి :*** విజన్ వచ్చాక కూడా కర్మధ్యానం కంటిన్యూ చెయ్యాలా?

***వంశీ మాష్టర్:*** అవసరం లేదు. విజన్ రావడాన్ని 'జ్ఞానం' అంటారు. ఇక 'అగ్ని' మిగిలి ఉంది. అంటే 'పరివర్తన'. గతంలో నేను ఇంత స్వార్థంతో మెలిగాను అన్న 'పశ్చాతాపం' కలగాలి. కనుక ఎప్పుడు ధ్యానంలో కూర్చున్నా మనస్ఫూర్తిగా 'క్షమాపణ' చెప్పండి. అది ఏ సమయంలోనైనా పరవాలేదు. విశ్వాత్మకి కావలసిందల్లా మనలో మార్పు మాత్రమే. అది నటనలా ఉండకూడదు. ఎందుకంటే కర్మదేవతలు మనకన్నా చాలా తెలివైనవారు. కనిపెట్టేస్తారు.

***వీణ :*** క్షమాపణ ఎవరికి చెప్పాలి మాష్టర్?

***వంశీ మాష్టర్:*** గతంలో మీ చేత బాధింపబడ్డ ప్రాణికి మీకు స్వప్నంలో కనిపించిన, మీవల్ల బాధ అనుభవించిన ఆ మూగప్రాణికి లేదా ఆ వ్యక్తికి అహంకార రహితంగా, మనస్ఫూర్తిగా పూర్తి పరివర్తన భావంతో క్షమాపణ చెప్పండి! అది చాలా తీవ్రంగా ఉండాలి! ఎంతంటే "రగిలే అగ్నిలా."

***సుబ్బలక్ష్మి :*** మాష్టర్ క్షమాపణ చెప్పిన తరువాత ఎన్ని రోజులలో నయం అవుతుంది?

***వంశీ మాష్టర్:*** మీ వల్ల హింస అనుభవించిన 'మహాకారణం శరీరం' లేదా మాష్టర్స్ మీ యొక్క పరివర్తనా తీవ్రతను గుర్తించి సంతృప్తి చెందిన మరుక్షణమే కర్మదగ్ధం అవుతుంది.

***లక్ష్మి:*** మాష్టర్ మహాకారణ శరీరానికి మనం అనుభవిస్తున్న కర్మలకీ ఏంటి సంబంధం?

***వంశీ మాస్టర్:*** ప్రతీ ఒక్కరికి ఒక 'మహాకారణ శరీరం' ఉంటుంది. అది పై నుండి కిందకు ఒక జీవాత్మను సృష్టించుకొని దానిని నడపడానికి కావలసిన స్థూలశరీరాన్ని అంటే భౌతిక దేహం తీసుకుని జంతువుగానో లేదా మనిషిగానో ఎంతో నేర్చుకోవాలి, భూలోకంలో ఆనందంగా గడపాలని ఆశతో వస్తుంది. ఆప్రాణి యొక్క జీవనగమనాన్ని, స్వేచ్ఛను మీరు హరించి వేస్తే, దానిని హింసిస్తే అర్ధాంతరంగా దాని "జీవనచక్రం" ఈ భూలోకంలో ఆగిపోతుంది. ఆ మహా కారణ శరీరానికి భూలోకంలో నేర్చుకోవలసిన పాఠాలు మీ హింసాత్మక చర్యల వలన ఆగిపోతాయి. సహజంగానే పైనున్న ఆమహా కారణ శరీరం మీ పై ఎంతో ద్వేషం, అసహనం కలిగి ఉంటుంది. మీరు మరలా తిరిగి ఇంకొక జన్మ తీసుకునేపుడు కారణలోకాలలో మీ అజ్ఞానం వల్ల హింసకు గురై అనుభవ పాఠాలు నేర్చుకొనే అవకాశం కోల్పోయిన ఆమహాకారణ శరీరానికి మీరే "సమాధానం" చెప్పవలసి ఉంటుంది. అక్కడ ఉన్న మాస్టర్స్ సహకారంతో జన్మ ప్రణాళికను రచించుకుని మీ వల్ల హింసకు గురైన వారిని మీ జీవితంలోకి ఏదో ఒక అనుబంధంగా ఆహ్వానించి, వాళ్ళవలన మీరు బాధను అనుభవించాల్సి ఉంటుంది. అది ఎంత అంటే వారి మహకారణ శరీరం 'సంతృప్తి' చెందినంత వరకు ఆ కర్మను అనుభవించవలసిందే!"

మరొకరి అనుభవం పరిశీలించుకుందాం.

ఒక స్త్రీ తన భర్త నుండి ఎంతో వేదన ఎదుర్కొంటుంది. అతను బాగా తాగి ఆమెను హింసిస్తూ ఉంటాడు. ఒక రోజు ఆమె నా వద్దకు వచ్చి మాస్టర్ మీరు చెప్పినట్లు నేను ఎంతో ఓర్పుతో, ప్రేమతో అతన్ని క్షమిస్తున్నా, కానీ అతను మారడం లేదు అని వాపోయింది.

అపుడు నేనన్నాను మీరు అతని వల్ల తప్పించుకోలేకుండా బాధింపబడు తున్నారు. అంటే దాని వెనుక ఏదో బలమైన గతం తాలూకా కారణం ఉండి ఉంటుంది. దాన్ని కర్మధ్యానం చేసి చూసుకోమని చెప్పాను.

అప్పటి నుండి ఆమో రోజూ కర్మధ్యానం చేయడం మొదలు పెట్టింది. తెల్లవారుజామున 3గం॥లకే లేచి కర్మధ్యానం చేసి ఆ శూన్య స్థితిలో ప్రశ్న వేసుకుంది.

మాష్టర్స్ నా భర్త నన్ను బాధిస్తున్నాడు. దీనికి కారణం నా గతజన్మలో అతనిని బాధించి ఉంటాను. దయచేసి దానిని నాకు చూపించండి' అని కోరుకొని అలా ధ్యానం చేస్తూ నిద్రపోయేది.

అలా రోజూ చెయ్యగా చెయ్యగా ఆమెకు 12 వ రోజు స్వప్నసందేశం వచ్చింది. ఆ కలలో ఆమెకు స్పష్టంగా కన్పించింది. గత జన్మలో ఈమె ఒక అత్తగారు. అహంకారంతో తన కోడల్ని ఎన్నో హింసలకు, అవమానాలకు గురి చేసినట్లు, అందువల్ల ఆ కోడలు యొక్క మహాకారణ శరీరాన్ని సంతృప్తి పరచడానికి ఈ జన్మలో ఆమె అతన్ని భర్తగా తెచ్చుకొని ప్రతిఫలాన్ని అనుభవిస్తునట్లు తెలుసుకుంది.

ఆమె ధ్యానంలో చూసుకున్న ఆ సంఘటనను గమనించి తాను గత జన్మలో తన కోడలి పట్ల ఎంతో హింస చేసానని గ్రహించి తరువాత ధ్యానంలో కూర్చొన్నప్పుడల్లా తాను గతంలో హింసించిన కోడలికి మనస్సులో క్షమాపణ చెప్పుకుంది. పై నున్న ఆ కోడలి మహాకారణ శరీరం దానికి సంతృప్తిపడి క్రిందనున్న ఈ జన్మలో తన శరీరమైన ఆమె భర్తలో మార్పు తీసుకు వచ్చింది.

దీనినే 'విధి ఆడే వింత ఆట', లేదా విధి చేతిలో కీలుబొమ్మలం మనం అంటారు. నిజానికి విధి కాదు. మహాకారణ శరీరం. మన వల్ల దాష్టీకానికి గురి అయిన మహాకారణ శరీరం ఆడే ఆట.

తరువాత ఆమె వచ్చి నాకు చెప్పింది. ఇపుడు తన భర్త తనని ఎంతో గౌరవంగా చూసుకుంటున్నాడని,అతనిలో ఎంతో మార్పు వచ్చిందని.

కనుక దుష్కర్మలన్నింటినీ పరిశూన్యం చేసుకోగల శక్తి మన వద్దే ఉంది! అన్నది పరమ సత్యం. అందుకే పరమయోగులు అంటారు... "పరివర్తనా హృదయమే పాప ప్రక్షాళన"

## కర్మ ధ్యానం ద్వారా ఆర్థిక పరిస్థితినైనా పరిష్కరించుకోవచ్చా?

***ప్రసాద్:*** మాష్టర్ ఈ కర్మధ్యానంలో పైనున్న మాష్టర్స్‌ని ఏ సమస్యనైనా అడగవచ్చా? ఆర్థికపరమైన బాధలు కూడా కర్మలో భాగమేనా?

***వంశీ మాష్టర్ :*** చక్కగా అడగవచ్చు. అయితే ఏ పనీ చేయకుండా ధనం రాలేదంటే అది ఖర్మ వలన కాదు. సోమరితనం, అత్యాశ వలన. ఎంతో

కష్టపడి పనిచేసినా, ఫలితం లేకపోయినా లేదా ఎంతో జాగ్రత్తగా దాచుకున్న డబ్బుపోయినా అది కర్మ కారణం అవుతుంది కనుక మీరు అనుభవిస్తున్న ఆర్థిక, మానసిక, శారీరక సమస్యలన్నీ ఏవైనా సరే పరిశీలించుకొని, పరిష్కరించుకోవచ్చు. ప్రతీ దానికి ఒక కారణం ఖచ్చితంగా ఉంటుంది. మీరు కారణాన్ని పట్టుకొని కార్యాన్ని సాధించు కోవచ్చు.

***మల్లి:*** మాష్టర్ శరీరపరమైన సమస్యకి ఉబ్బసం వ్యాధి ఉన్న వ్యక్తి అనుభవం ఉదాహరణ చెప్పారు. మానసికానికి భార్యభర్తల సమస్యను ఉదాహరణగా చెప్పారు. ఆర్థికపరమైన కర్మని తొలగించుకున్న అనుభవం ఏవరిదైనా చెప్పండి?

***వంశీ మాష్టర్:*** ఒకసారి నెల్లూరు వద్ద ఒక వ్యక్తి వ్యాపారంలో ఎంతో నష్టపోయి దివాళా దశలో ఉన్నాడు. ఎక్కడ పెట్టుబడి పెట్టినా ఏదో ఒక నష్టం వస్తుంది. ఎంత కష్టపడి పని చేసిన అది వృధా అవుతుంది. అతను నా వద్దకు వచ్చి ఏదైనా జాతకరత్నం గాని, తన ఇంటి వాస్తు దోషాన్ని గాని, శాంతిని గాని చెయ్యమని బ్రతిమిలాడాడు. నేను అతనికి ఒక్క మాటలో చెప్పాను.

సరిచెయ్యవలసింది "వాస్తుదోషాన్ని కాదు, వాసనా దోషాన్ని". అంటే "గతజన్మల పాపాల తాలుకా వాసనల్ని సరిచేసుకోవాలి". కనుక కర్మధ్యానం చేసి ఎందుకు దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నావో, తెలుసుకోమని చెప్పాను. అతను రోజూ చెయ్యగా.. 18వ రోజు అతనికి ఒక చక్కటి స్వప్న అనుభవం వచ్చింది. తను గత జన్మలో వడ్డీ వ్యాపారస్తుడట. వడ్డీ డబ్బుకోసం ఒక వ్యక్తిని దారుణంగా హింసిస్తున్నట్లు కనిపించింది. అది చూడగానే అతనికి ఎంతో వేదన కలిగింది. తను 'గతంలో డబ్బుకోసం ఇంత నీచంగా ప్రవర్తించానా' అనుకొని, తరువాత ధ్యానంలో కూర్చున్నపు డల్లా తనవల్ల అవమానానికి గురైన వ్యక్తికి మనస్ఫూర్తిగా క్షమాపణ చెప్పాడు. తరువాత కొంతకాలానికి ఆటోమాటిక్‌గా అతనికి ఆర్థికపరమైన బాధలు తొలగిపోయాయి. ఎంతో కలిసి వచ్చింది.

కనుక మీరు అనుభవిస్తున్న లేమికి ఒక కారణం ఖచ్చితంగా ఉండి ఉంటుంది. దాన్ని తెలుసుకుని సరిచేసుకోవడం ఉత్తమం. జాతకరత్నాలు, శాంతులు, పూజలు, హోమాల కన్నా కర్మధ్యానం సులువైన పద్ధతి.

***అనిత:*** మాష్టర్ పేదరికం ఆత్మకు ఏవిధంగా శిక్షణ అవుతుంది. ఇది కూడా కర్మచక్రానికి సంబంధం ఉంటుందా?

***వంశీ మాష్టర్:*** ఖచ్చితంగా పేదరికం కూడా ఆత్మకి ఒకానొక శిక్షణలో భాగమే. 'ఉదాహరణకు కుచేలుడి కథ చూద్దాం.'

కుచేలుడు,శ్రీకృష్ణుడు బాల్యంలో సాందీపుని వద్ద విద్యాభ్యాసం చేసే రోజులలో ఇద్దరూ అడవికి కట్టెలు తేవడానికి వెళతారు. గురువుగారి భార్య మధ్యాహ్నం తినడానికి భోజనం ఇద్దరికి మూట కట్టి ఇస్తుంది. కొంత దూరం వెళ్ళిన తరువాత కుచేలుడు తన ఆహారం తినివేసి ఇంకా ఆకలి తీరకపోవడంతో కృష్ణుడు వైపు చూస్తుంటాడు. అది గమనించిన కృష్ణుడు తన ఆహారాన్ని కుచేలుడికి ఇచ్చి వేసి నీటితో కడుపు నింపుకుంటాడు. సాయంత్రానికి దారి తప్పడం వలన ఆశ్రమానికి చేరలేక పోతారు. చీకటి పడటంతో ప్రయాణాన్ని ఆపి క్రూర మృగాలకు దొరకకుండా రాత్రంతా ఒక చెట్టు పై కూర్చొంటారు. మధ్య రాత్రిలో కుచేలుడు తన వద్ద దాచుకున్న బఠాణీలు తింటుంటాడు. ఆకలితో ఉన్న కృష్ణుడు 'ఏంటి తింటున్నావు'? నాకు కూడా  పెట్టవా? అని అడిగితే 'ఏమీ లేదు', చలికి పళ్ళు కొరుకుతున్నా అని అబద్ధమాడతాడు.

విధ్యాభ్యాసం తరువాత "ఇచ్చే గుణం" లేని కుచేలుడు విపరీతమైన దారిద్ర్యాన్ని అనుభవిస్తాడు. తనది కూడా పక్కవాడికి పెట్టే గుణం ఉన్న కృష్ణుడు రాజు అయ్యి, భోగ భాగ్యాలలో తులతూగుతుంటాడు.

తన లేమిని తాళలేక కుచేలుడు భార్య సలహాపై శ్రీకృష్ణుడుని సహాయం చేయమని అడగడానికి వెళతాడు. అలా వెళ్ళినపుడు ఉత్తి చేతులతో వెళ్ళలేక తన వద్ద ఉన్న కొంచెం అటుకులను తీసుకువెళ్ళి కృష్ణుడుకి ఇస్తాడు. అపుడు శ్రీకృష్ణుడు అతనికి అపారమైన సంపదలు అందిస్తాడు. ఈ కథలో గొప్ప నీతి ఉంది.

మొదట్లో కుచేలుడిలో ఇచ్చే గుణం లేదు. అందుకే బాల్యంలో తన వద్ద ఉన్నా శ్రీకృష్ణుడుకి పెట్టలేదు. అందువల్ల అతనికి "దరిద్రం అన్న శిక్షణ" అవసరం అయ్యింది. తరువాత తనవద్ద ఏమీలేని స్థితిలో కూడా అటుకులను శ్రీకృష్ణుడుకి ఇచ్చాడు.

అతనిలో 'లేమి' అనుభవించిన తరువాత 'ఇవ్వాలి' అన్న జ్ఞానం అంకురించింది. కనుక ప్రకృతి అతనికి 'దారిద్ర్యం' అన్న శిక్షణను తొలగించింది.

శ్రీకృష్ణుడి ద్వారా సకల భోగాలూ సమకూరాయి. ఇక్కడ కృష్ణుడు ఒక "కారణం మాత్రమే". సంపదలు రావడానికి కారణం కుచేలుడు తనలో "ఇచ్చే గుణం" పెంచుకోవడమే.

కనుక మీరు కూడా "ఇచ్చే గుణాన్ని" పెంచుకోండి అప్పుడు మీకు సంపదలు వచ్చి పడతాయి.

ఒక విత్తనం నాటితే వందగింజలు వస్తాయి. అది ప్రకృతి ధర్మం. ఒక్క విత్తనం కూడా నాటకుండా గింజలు కోరుకోవడం ఎంత వరకూ న్యాయం? అందుకే 'బ్రహ్మర్షి పత్రీజీ' ఇలా అంటారు.

చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ!

చేసుకోనివారికి చేసుకోనంత మహాదేవ!!

## జాతకరత్నాలలో, తీర్థస్నానాలలో శక్తి లేదా?

***శివరంజని:*** అయితే మాస్టర్ జాతకరత్నాలు, వాస్తుదోష నివారణలు, శకునాలు, శాంతులు, హోమాలు ఇవేవీ శక్తి లేనివా?

***వంశీ మాస్టర్:*** నేను వాటిలో శక్తి లేదనటం లేదు. వాటికన్నా ఎక్కువ శక్తి మీలో ఉంది అంటున్నాను. బయట శక్తులు 10% సమస్య నివారణ చూపిస్తే మీలో ఆత్మశక్తి 100% ఫలితాన్ని చూపిస్తుంది. మీరు దేనిని ఎంచుకుంటారు.

10% ప్రభావం చూపించే శాంతులు, హోమాలు, జాతకరత్నాలు, వాస్తులు, అంటూ పరిగెడతారా? లేక మీలో ఉన్న ఆత్మశక్తిని ధ్యానం ద్వారా పెంచుకొని, 100% ఫలితం సాధించుకుంటారా? ఏది సులువు?

కనుక ధ్యానం చెయ్యండి. మీ లోపలి మలినాలను శుభ్రం చేసుకోండి. ఆత్మతేజస్సు పెంచుకోండి.

"మీ ఆత్మశక్తి ముందు ఏ దుష్టశక్తి నిలబడదు".

"దివ్యాత్మశక్తి ముందు ఏ దుష్కర్మ మిగలదు".

**రాజు:** మాష్టర్, పుణ్యస్నానాలూ, తీర్థయాత్రల వలన కూడా పాప కర్మలు తొలగిపోతాయి' అంటారు వాస్తవమేనా?

**వంశీ మాష్టర్:** కౌరవులందరినీ అంతమొందించి, మహాభారత యుద్ధం ముగిశాక తమ పాపాలను కడుక్కోవడానికి పాండవులు తీర్థయాత్రలకు బయలుదేరతారు. అన్ని ముఖ్యనదులలోనూ స్నానం చేసి వస్తే పవిత్రత వస్తుందనీ, సకల పాపాలు హరించివేయబడతాయి' అని పండితులు సెలవిచ్చిన మీదట, కృష్ణుడుని కూడా తమతో రమ్మని పాండవులు కోరతారు. తనకు వీలుకాదని ఒక సొరకాయ ఇచ్చి తన బదులు దానిని అన్ని నదులలో స్నానం చేయించమని శ్రీకృష్ణుడు పాండవులకు చెపుతాడు. ఆరునెలల పాటు దేశంలో అన్ని ఆలయాలను దర్శించుకొని సొరకాయతో సహా పాండవులు అన్ని పుణ్యనదులలో స్నానమాచరించి తిరిగి హస్తినకు చేరుకుంటారు.

పాండవులు తిరిగి వచ్చిన సంధర్భంగా గొప్ప విందు ఏర్పాటు చేస్తారు. శ్రీకృష్ణుడు తానిచ్చిన ఆ సొరకాయను ఆ విందు వంటకాలలో కలపమంటాడు. ఆ సొరకాయ చేదుగా ఉండటం వలన ఆ విందు భోజనం మొత్తం పాడవుతుంది.

అర్జునుడు శ్రీకృష్ణుడు వద్దకు వెళ్ళి మీరు చూసుకోకుండా చేదు సొరకాయను ఇచ్చారు బావా, దాని వలన విందు అంతా పాడయ్యింది" అంటూ నిష్టూర మాడతాడు.

శ్రీకృష్ణుడు చిరునవ్వుతో, "అది చేదు సొరకాయ అని నాకు ముందే తెలుసు, అందుకే మీకు ఇచ్చి, అన్ని పుణ్యనదులలో స్నానం చేయించమన్నాను. అలా అయినా చేదు పోతుందేమోనని. కాని ఎన్ని పుణ్యస్నానాలు చేసినా దాని చేదు పోలేదన్నమాట. ఇక మీ పాపాలు ఏం పోతాయో ఏమిటో" అంటాడు చిద్విలాసంతో!

"కనుక మనం ఎన్ని తీర్థయాత్రలు చేసినా, ఎన్ని పుణ్యనదులలో స్నానమాచరించినా, కాస్త ఆనందం వస్తుందే తప్ప ఏకర్మా తొలగదు.

"కర్మ తొలగాలంటే జ్ఞానం రావల్సిందే!". "జ్ఞానం రావాలంటే ధ్యానం చెయ్యాల్సిందే!"

**మాధవి:** మాష్టర్ నేను ధ్యానం చేస్తే మా పిల్లలకి ఉపయోగపడుతుందా?

***వంశీ మాష్టర్:*** మీరు తింటే మీ పిల్లలకి ఆకలి తీరుతుందా? లేదుకదా? అలానే మీరు ధ్యానం చేస్తే మీకు లాభం. వారు ధ్యానం చేస్తే వారికి లాభం. ఎవరి వలన వారికే లాభం! ఎవరి వలన వారికే నష్టం. కాకపోతే మీరు ప్రతిరోజూ ధ్యానం చేసి శాఖాహారిగా మారి ప్రేమతో, శాంతముతో సంతోషంగా ఉంటుంటే మిమ్మల్ని చూసి ఏదో ఒక రోజు మీ ఇంట్లో వారు కూడా ధ్యానం మొదలుపెడతారు.

## "తెలియక చేసిన కర్మలు"

***విజయ :*** మాష్టర్ నేను చేసిన పని నాకు తెలియకుండా ఎవరికైనా హాని కలిగిస్తే, అది నా దోషమేనా? సంచిత కర్మ అవుతుందా?

***వంశీ మాష్టర్:*** ఖచ్చితంగా కాదు. మీరు ఉద్దేశ్యరహితంగా చేసిన చర్య వలన జరిగిన హానిలో మీకు సంబంధం ఉండదు. ఇక్కడ 'ఉద్దేశ్యరహితం' అన్నది చాలా జాగ్రత్తగా అర్థం చేసుకోండి.

ఇప్పటికీ బౌద్ధమతంలో ఉన్న కొంతమంది బుద్ధుడి అహింసా సిద్ధాంతానికి తూట్లు పొడిచి చక్కగా మాంసాహారం ఆరగిస్తారు. కాకపోతే వాళ్ళు మాంసం తినేముందు వారితో వండి,వడ్డించే వారు "అయ్యా! ఇది మీ కొరకు వండినది కాదు. మా కోసం వండుకున్నది మీకు పెడుతున్నాం" అనాలి. అపుడు తినేవారు ఆ 'నిషిద్ధ' ఆహారం "ఉద్దేశ్య పూర్వకంగా" తమ కోసం వండలేదు కాబట్టి, ఏ దోషం అంటదు అని శుభ్రంగా మాంసాన్ని ఆరగిస్తున్నారు.

ఇంతకన్నా ఆత్మ వంచన ఉంటుందా? ఇలాంటి వాళ్ళను చూసి బుద్ధుడి ఆత్మ ఏమనుకుంటుందో? మానవుడు తాను చాలా తెలివైన వాడినని, విజ్ఞానవంతుడను అని ఇటువంటి 'సదుపాయ శాస్త్రాలు' అనేకం కనిపెట్టుకున్నాడు. సృష్టికర్తముందు ఇటువంటి ఆటలు చెల్లవు. కర్మచక్రం చాలా నిక్కచ్చిగా ఉంటుంది.

కనుక "ఉద్దేశ్యరహితం" అన్నది బాగా అర్థం చేసుకోండి. ఒక వేళ మీ వలన అవతలవారు కష్ట పడ్డారని అనిపిస్తే వెంటనే వారికి క్షమాపణ

చెప్పండి. వారికి తగిన సహాయం చెయ్యండి. మిమ్మల్ని మీరు వెనకేసుకు రాకండి. వారివైపు నుండీ ఆలోచించండి. అపుడే కర్మచక్రంలో ఇరుక్కోకుండా ఉంటారు.

## 'యుద్ధం' కర్మ అవుతుందా?

***సువర్ణ:*** మాష్టర్ నేను అందరికోసం ఒక మంచి పని చేస్తున్నాను. కొంతమంది తమ స్వార్థం కోసం నన్ను అడ్డుకుంటున్నారు. అపుడు నేను వారితో పోరాడవచ్చా? అది కర్మ అవుతుందా?

***వంశీ మాష్టర్:*** ఖచ్చితంగా యుద్ధం చేయవలసివచ్చినపుడు చేసే తీరాలి. అయితే ఆ యుద్ధం ప్రేమ యుద్ధం అయి ఉండాలి. ప్రేమ యుద్ధం అంటే గుణాలపై చేసేది తప్ప, మనుషులపైన కాదు. కనుక యుద్ధం చేయవలసి వస్తే ద్వేషం తీసివేసి చేయండి. అంచేత మీ మంచిపనికి అడ్డం పడేవారిని "ద్వేషం లేకుండా" ఎదుర్కోండి. అపుడు దానివలన వారు కొంత బాధకు గురైనట్లైనా అది పాపకర్మగా మీకు జమ చేయబడదు.

***కళావతి:*** మాష్టర్ ఒక వ్యక్తి తన భార్యను హింసిస్తున్నాడు. నేను వెళ్ళి ఆపాను. నా స్నేహితురాలు నన్ను మందలించింది. ఆమె కర్మకు నీవు అడ్డుపడుతున్నావు. భర్త చేతిలో హింసను అనుభవించాలని ఆమె ఎంచుకుంది నీవు ఎందుకు అడ్డుపడుతున్నావు?" అన్నది. నేను పొరపాటు చేసానా?

***వంశీ మాష్టర్:*** లేదు మీరు ఆ స్త్రీ కర్మకు అడ్డుపడలేదు. మొదటగా నేను మిమ్మల్ని అభినందిస్తున్నాను. సాటి స్త్రీ పై జరుగుతున్న హింసను అడ్డుకుంటున్నందుకు. నిజానికి ఇది గత జన్మ కర్మ? కొత్తగా చేస్తున్న కర్మ అన్న విషయం మీకు తెలియదు. అయినా ఆ స్త్రీ పై జరిగే హింసను ఆపే అవకాశం మీకు వచ్చింది అంటే ఆ కర్మ ప్రణాళికలో 'నీ పాత్ర కూడా ఉంది' అని అర్థం. ఇతరులపై హింస జరుగుతుంటే ఇంకేమీ ఆలోచించకుండా మీకు చేతనైన సహాయం చేయండి. మీరు అలా చేయడం వలన ఆమె భర్త మరింత "దుష్కర్మ" పోగుపెట్టుకోకుండా కాపాడినవారు అవుతారు. మీకు సలహా ఇచ్చిన స్నేహితురాలు అజ్ఞానంలో ఉంది. ఆమె సలహాలు పట్టించు కోకండి. మీకు ఆ మీకు అలాంటి సమయాలలో ఏమనిపిస్తే అది చేయండి.

***వెంకటేశ్వర్లు:*** మాష్టర్ ఈ మధ్యన రామ్తాగారి పుస్తకాలు. చదివాను, విజయవాడలో జరిగే రామ్తా క్లాసులకు వెళ్ళాను. వారు చెప్పినదేమంటే

కర్మలు లేవు, కనుక మాంసాహారం తినవచ్చని, మనం దైవాలని, సృష్టికర్తలమని, జంతువులను సృషించింది మనమేననీ, కనుక వాటిని చంపి తినడంలో దోషం లేదని" అంటున్నారు. నిజమేనా? ఇది ఎంతవరకు సత్యం?

***వంశీ మాస్టర్:*** మీరే అంటున్నారు, పుస్తకాలు చదివాను అని. పుస్తక జ్ఞానం అవగాహన వరకే పనికివస్తుంది. "అనుభవజ్ఞానమే అసలైన జ్ఞానం." ఆ అనుభవం ధ్యానం ద్వారా మాత్రమే అంకురిస్తుంది. మీకు చెప్పిన వారికి అదిలేదు.

అయినా కర్మలు లేవు అంటే మాంసం తింటారా?

మీ హృదయంలో కరుణ లేదా?

మీదీ ప్రాణమే, మీరు చంపి తింటున్న జంతువుది కూడా ప్రాణమే అన్న చిన్న విషయం మీకు తెలియందా?

కత్తితో కోస్తే మీకు ఎంత బాధ కలుగుతుందో, ఆ ప్రాణికి కూడా అంతే బాధ కలుగుతుంది అన్న కాస్త ఇంగిత జ్ఞానం ఉంటేచాలు, మాంసాహారం మాని వేయడానికి. దీనికి ఏ పుస్తకాలు పరిశోధించాల్సిన పని లేదు. కాస్త ఎరుక ఉంటే చాలు.

ఏమన్నారు వారు, మీరే సృష్టించారా? ఏది ఇప్పుడు సృష్టించండి చూద్దాం. చేతనైతే ఒక చిన్న మేకకు ప్రాణం పొయ్యగలరా?

సృష్టించే శక్తి లేని వారికి ప్రాణం తీసే హక్కు ఎవరిచ్చారు?

కనుక ఏ ప్రాణీ ఎవరి కోసమూ సృష్టించబడలేదు. ప్రతి ప్రాణీ తన కోసం తాను సృష్టించబడింది. ఏ జీవీ మీది కాదు. దేనిపై మీకు అధికారమూ లేదు. ప్రతీ జంతువూ తన ఆత్మ ఉన్నత తత్వం కోసం తాను బతుకుతుంది. ఆత్మ పరిణామక్రమంలో ఎదగడానికి భూలోకంలో స్వనిర్ణయంతో జన్మ తీసుకుంటుంది. మీపై ఎవ్వరికీ ఏ విధమైన హక్కు ఎలాగైతే లేదో మీకు కూడా ఏప్రాణి జననమరణాలు, జీవనగతిపై హక్కూ అధికారం లేవు.

"హక్కు లేనిది చేస్తే అది హింస అవుతుంది".

"తద్వారా అది కర్మగా స్థిర పడుతుంది".

మీ ప్రశ్నలో మరొక అంశం. మనం దైవాలన్నది నిజం. అయితే ఆ దైవస్థితిలో మనం ఉన్నామా అన్నది ఆత్మపరిశీలన ద్వారా మనకు మనం తేల్చుకోవాలి.

దైవస్థితిలో అంటే "థర్డ్ ఐ మాష్టర్" స్థితిలో ఉన్నవారికి కర్మంటూ ఏదీ ఉండదు. వారు "ముక్త పురుషులు". సృష్టి వీరిని కర్మచక్రం నుండి మినహాయిస్తుంది. ఎందుకంటే ఆ స్థితిలో ఉన్నవారు ఏప్రాణికీ హాని కలిగించరు. వారికి ఎటువంటి స్వార్థం ఉండదు.

అయితే మీరు ఇప్పుడు ఏ స్థితిలో ఉన్నారు?

మానవస్థితిలోనా? దైవస్థితిలోనా?

నిజానికి మీరు ఇద్దరన్నమాట. ఒకరు నరుడు, మరొకరు నారాయణుడు. అంటే మీరు 'నర' రూపంలో ఉన్న నారాయణుడు.

మీలో నారాయణుడు ఉన్నాడు సరే.

"మరి నరుడి సంగతేంటి?"

మీరిప్పుడు నరుడిగా ఉన్నారు కనుక జన్మపరంపరలో మీరు నారాయణుడి స్థితికి ఎదిగినప్పుడు నరుడు మాయం అవుతాడు. అప్పుడు ఏ కర్మచక్రానికి మీరు లోబడి ఉండరు. మరి నరుడు నారాయణుడు కావాలంటే 'ధ్యానం' చేయవలసిందే. అంతవరకు కర్మచక్ర భ్రమణంలో పడి తిరగవలసిందే. ఎవరు అవునన్నా కాదన్నా ఇది పరమ సత్యం."

రామ్మో గారు గొప్ప ఆత్మజ్ఞాని. వారు చెప్పింది సరిగ్గా అర్థం కానివారు అలా మాట్లాడతారు. రామ్మోగారు చెప్పింది ఆత్మస్థితిలో ఉంటే కర్మలు లేవని. కొంతమంది దానిని వక్రీకరించుకొని, తమకు నచ్చినట్టు మార్చుకుని మాంసాహారం తినవచ్చని ప్రచారం చేస్తున్నారు. వాళ్ళు తెలివైన మూర్ఖులు, ధ్యానభ్రష్టులు. వీరికి, రామ్మోకు ఏ సంబంధమూ లేదు.

అందుకే భీష్మపితామహుడు అంటాడు –

"మొదటగా మీరందరూ తెలుసుకోవలసిన విషయం ఏమిటంటే ఈ భూలోకంలో చాలా తెలివిగలవారు ఉన్నారు. చాలా మందికి తెలివి ఉన్నప్పటికీ ఆత్మజ్ఞానం ఉన్నది కొద్ది మందికే."

ఆత్మజ్ఞానం తక్కువ, తెలివి ఎక్కువగా ఉండటం వలన కర్మ సిద్ధాంతాన్ని ఓడించడానికి కొత్త కోణాలనుండి వాదనలు చేస్తున్నారు.

కాని వారు తెలుసుకోవలసింది ఏమిటంటే "సత్యాన్ని ఎప్పుడూ కూడా తెలివితో అతిక్రమించలేరు." మీరు సత్యం తెలుసుకోవాలి అనుకుంటే ధ్యానం చెయ్యాలి. మీ ఆత్మప్రభోదాన్ని వినాలి.

"ఎందుకంటే మీ ఆత్మ మీకు "స్వచ్ఛమైన జ్ఞానం" అవసరం అనుకుంటుంది కనుక."

## సేవలు చేస్తే కర్మలు తగ్గుతాయా?

***భారతి :*** మాష్టర్ సేవ చేస్తే పాపకర్మలు తగ్గుతాయి అంటారు నిజమేనా?

***వంశీ మాష్టర్:*** నిజమే. మీ కర్మ రుణాన్ని "తగ్గించుకోవడానికి" ఫలవంతమైన మార్గం సేవామార్గం. ఎవరైతే పాపకర్మలు తీవ్రంగా అనుభవిస్తున్నారో, ఎవరికైతే సహాయం కావాలో వారిని ఎన్నుకొని వారికి తగు సహాయం చెయ్యండి మీ శక్తిని, ధనాన్ని, జ్ఞానాన్ని వారికి ఉపయోగించండి. దీనివలన మీరు మీ కర్మను తగ్గించుకొన్న వారేకాక ఇతరులకు ప్రేమానురాగాల విలువ తెలుసుకునేందుకు సహాయ పడినవారు అవుతారు.

అయితే ఇది మీరు ఏమీ ఆశించకుండా స్వార్ధరహితంగా ఇతర ప్రాణికోటికి సేవ చెయ్యాలి. అపుడే మీ కర్మ రుణాన్ని రెట్టింపు వేగంతో తగ్గించుకుంటారు. కర్మ చక్రాన్ని నడిపించే ముఖ్యసూత్రాలు ఇవే.

## 'యాక్సిడెంట్స్' కర్మలో భాగమా?

***ఉష:*** మాష్టర్ యాక్సిడెంట్స్ జరుగుతుంటాయి కదా, అది కూడా కర్మచక్రంలో భాగమేనా?

***వంశీ మాష్టర్:***ఒక్క ఆత్మహత్య చేసుకోవడం తప్ప ప్రతిదీ మీ ముందస్తు ప్రణాళికలో భాగమే! కర్మరుణాన్ని తగ్గించుకొనేందుకు కొన్ని ఆత్మలు యాక్సిడెంట్స్‌ని ఎంచుకుంటాయి. మరికొన్ని దీర్ఘకాలిక రోగాలను ఎంచుకుంటాయి. ఏది కావాలో పూర్తి ఎంపిక స్వేచ్ఛ మీరు ఇవ్వబుడుతుంది. అయితే ఆత్మహత్య మాత్రం మానవుడి బుర్రలో అప్పటికప్పుడు పుట్టిన

ఆలోచన. తొందరపాటు నిర్ణయం.

అందుకే అన్ని శాస్త్రాలూ ఆత్మహత్యను మహాపాపంగా వర్ణిస్తాయి.

## ఆత్మహత్య పాపమా?

***శివరంజని:*** మాష్టర్ మనిషికి తన ప్రాణాన్ని తీసుకునే స్వేచ్ఛ కూడా లేదా? తనని తాను చంపుకుంటే అది ఏవిధంగా పాపం అవుతుంది.

***వంశీ మాష్టర్:*** ఖచ్చితంగా మనిషి తనను తాను హింసించుకోవడం, లేదా, బలవంతంగా ప్రాణాలు తీసుకోవడం పూర్తిగా "మహాపాపం." ఎందుకంటే ఇక్కడ హత్య చేస్తుంది మిమ్మల్ని మీరు కాదు, మీ ఆత్మయొక్క ప్రణాళికను, భూలోకపు అనుభవాల పాఠాలను, "విధాత మీపై పెట్టుకున్న ఆశల్నీ" ఇలా అన్నింటినీ మీరు సమూలంగా తుడిచి పారేస్తారు కాబట్టి.

ఒక ఆత్మ ఒక శరీరాన్ని సంపాదించుకోవడానికి కారణలోకాల్లో ఎన్నో సంవత్సరాలు ఎదురుచూడాలి. దేహం కోసం తన ముందు దాదాపు కొన్ని లక్షల ఆత్మలు వేచి ఉంటాయి. వాటి ఎంపిక, దేహదారణ పూర్తి అయిన తరువాత మీ వంతు వస్తుంది. తరువాత తల్లి గర్భంలో ప్రవేశించాక బిడ్డగా మారి భూమి మీదకు వచ్చేవరకు ఎన్నో ప్రయాసలు. దీనికి ఎందరో మాష్టర్ల సమిష్టి కృషే మీ జీవితం. ఎన్నో కర్మబంధాలు అనుభవించడానికి, పూరించడానికి, ఎన్నో కర్మరుణాలు తీర్చుకోవడానికి, భువి నుండి దివికి దిగివస్తాం! అంత కష్టపడి తెచ్చుకున్న దేహన్ని, జీవితాన్ని ప్రాపంచికపు కోరికలో ఏదో దొరకలేదని భంగపడి ఆత్మహత్య చేసుకోవడం ఎంతో దారుణం. ఆత్మహత్య చేసుకున్న వారికి మళ్ళీ దేహం దొరకడం దుర్లభం. ఎందుకంటే ఒక్కసారి దేహన్ని ఇస్తే పాడుచేసుకున్నవారికి మళ్ళీ ఆ అవకాశం ఎవరు ఇస్తారు?

***వీణ:*** మాష్టర్ ఆత్మహత్య మహాపాపమే. కాని ఆ సమయంలో ఎవరికీ ఇంత ఆలోచన ఉండదు కదా! అపుడు ఆ ఉద్వేగాన్ని ఎలా తప్పించుకోవాలి?

***వంశీ మాష్టర్:*** అందుకే మీరు ముందుగానే "జ్ఞానాన్ని" సంపాదించు కోండి. ఎక్కువగా ధ్యానం చెయ్యండి. చేతులు కాలాక ఆకులు పట్టుకుని ఏమీ

ప్రయోజనం ఉండదు. ఇక ఆ సమయంలో అంటే ఆత్మహత్య చేసుకోవాలని మీ మనస్సు గాయపడిన తీవ్రమైన పరిస్థితిలో మీరు మీ చావును ఒక్కరోజుకు ''వాయిదా'' వేసుకోండి. రెండవ రోజుకి మీ చావు ఆలోచన బలహీనమవుతుంది. మీలో ఎరుక ప్రారంభమవుతుంది. మీ జీవితంకోసం ఆలోచించడం మొదలుపెడతారు.

ఎప్పుడైనా సరే తేల్చుకోలేని మీ సమస్యలను కాలానికి వదిలివేయండి. ఎందుకంటే "కాలాన్ని మించిన స్నేహితుడు లేడు."

## కర్మశూన్యత ఎలా చేసుకోవాలి?

***రేవతి:*** మాస్టర్ కొత్త కర్మలు కూడబెట్టుకోకుండా, సంచితకర్మలు ఏవిధంగా తగ్గించుకోవాలి? కర్మను శూన్యం చేసుకుని జన్మరాహిత్యం పొందాలంటే ఎన్ని జన్మలు పడుతుంది?

***వంశీ మాస్టర్:*** ఇన్ని జన్మలు అని ఖచ్చితంగా చెప్పలేము. అది వారి వారి "ఆత్మస్థితిని" బట్టి ఉంటుంది. పిల్లవాడు చదివిన దానిని బట్టి మార్కులు ఉంటాయి.

ఈ భూలోకంలో నివసిస్తున్న ప్రతీ ఒక్కరు ఇప్పటికే కొన్ని వందల, వేల జన్మలు ఎత్తి ఉన్నారు. అయినప్పటికీ చాలామంది జన్మరాహిత్యాన్ని చూడలేదు. ఎందువలన అంటే జన్మ తీసుకొనే ముందు ప్రతి ఆత్మ 'అన్ని కర్మరుణాలను' ఒకేసారి తీసుకుని రాదు. దాని యొక్క అవగాహనా శక్తిని అనుసరించి కొన్ని కర్మ రుణాలను మాత్రమే భూలోకానికి తీసుకొని వస్తుంది. ఏ ఆత్మ కూడా సంపూర్ణంగా ఒకే జీవితంలో తన కర్మలను ఎదుర్కోవడానికి సిద్దపడదు. ఒకవేళ సిద్ధపడినా మాస్టర్స్ అవకాశం ఇవ్వరు. ఎందుకంటే మీ బిడ్డను మీరు ఒకేసారి వంద కేజీల బరువును మోయనిస్తారా? మాస్టర్స్ కూడా అంతే.

ఇక కొత్తకర్మలు అంటే ఆగామికర్మల చిట్టా పెరగకుండా ఉండాలంటే, మీరు ఆత్మవిజ్ఞానాన్ని సంపాదించుకోవాలి. "మరణం తరువాత ఏమౌతాను నేను? అసలునేను ఎవరు? ఎక్కడ నుండి వచ్చాను? భూలోకంలో నేను ఎందుకు జన్మించాను? ఇక్కడ నుండి పరమాత్మతో ఎలా అనుసంధానం

పొందాలి?" ఇలా ఎంతో జ్ఞానాన్ని మనం సంపాదించుకోవాలి. మరింత నేర్చుకోవాలి. ఇది ధ్యానసాధన, సజ్జనసాంగత్యం, స్వాధ్యాయం ద్వారా సాధ్యమౌతుంది.

కనుక మనముందు ఆత్మ జ్ఞానమన్న సిలబస్ చాలా ఉంది. 'అది ఎలా నేర్చుకోవాలి' అన్నది ఆలోచించండి. "జన్మరాహిత్యం గురించి ప్రక్కన పెట్టండి. రావలసిన సమయంలో అదే వస్తుంది."

***దేవి:*** మాష్టర్ నేర్చుకోవడానికే భూలోకంలో జన్మ తీసుకోవాలి అన్నారు. సూక్ష్మలోకాలలో వాటంతట అవే తెలుస్తాయి కదా! అసలు భూలోకంలో జన్మ తీసుకొని కర్మ చిట్టా ఎందుకు పెంచుకోవాలి, అవి తీర్చడానికి ఎందుకు శ్రమ పడాలి?

***వంశీ మాష్టర్:*** చక్కటి ప్రశ్న వేశారు. మనం భూలోకంలో ఉన్నప్పటి నుండే జ్ఞానాన్వేషణ ప్రారంభించాలి. సూక్ష్మలోకంలోకి వెళ్ళినాక, అంటే మరణా నంతరం దానిని అనుభవంలోకి తెచ్చుకుంటాము. ఎందుకంటే మరణానికి ముందు ఏ అనుభవజ్ఞానం మనలో ఉంటుందో అదే అనుభవిస్తాం తప్ప మరణం తరువాత ఏదీ నేర్చుకోలేము.కారణం ఇంద్రియాలు ఉండవు కనుక.

భూలోకంలో "దివ్య జ్ఞానం" కోసం శ్రమపడకుండా ప్రాపంచికపు కోరికల కోసం జీవిస్తే సూక్ష్మలోకాల్లో కూడా మనం సుఖాలకు, కోరికలకు ప్రాధాన్యత ఇస్తామే కాని ఆత్మాభివృద్ధికి ఏమాత్రం ప్రాముఖ్యతనూ ఇవ్వం. ఎందుకంటే ఏది చదివామో అదే పరీక్షల్లో వ్రాయగలుగతాము కనుక.

అందుచేత భూలోకంలో ఉండగానే ఆత్మజ్ఞానాన్ని సంపాదించు కోవాలి. చనిపోయిన తరువాత సూక్ష్మలోకానికి వెళ్ళగానే దానిని అభివృద్ధి చేసుకోవాలి. ఇది సుళువైన పద్ధతి.

ఖచ్చితంగా చెప్పాలంటే జ్ఞానాన్ని అభ్యసించడానికి, అభివృద్ధి చేసుకోవ డానికి తక్కువగా అభివృద్ధి చెందిన సూక్ష్మలోకాల కంటే భూలోకంలోనే అవకాశాలు ఎక్కువ.

***సువర్ణ:*** మాష్టర్ గత జన్మ జ్ఞాపకాలు, అప్పుడు నేను సంపాదించుకున్న జ్ఞానం ఇప్పుడు నాకు ఎందుకు గుర్తులేవు?

***వంశీ మాష్టర్:*** మనం భూలోకంలో తల్లి గర్భం నుండి బయటకు రాగానే బొడ్డు పేగుతో పాటు గతజన్మల జ్ఞాపకాలు పూర్తిగా కత్తిరించ బడతాయి. ఎందుకంటే అదే సృష్టినియమం.

భూలోకంలో మన యొక్క మత విశ్వాసాల వలన, వాంఛల వలన, మనకు తెలిసిన "కొద్దిపాటి" సైన్స్ వలన మనం ఒక రకమైన అపనమ్మకాలతో ఉంటాం. దానివలన కారణలోకాలలో నిక్షిప్తమై ఉన్న మన జ్ఞానాన్ని, గతజన్మ అనుభవాలను గుర్తుకు తెచ్చుకోలేము.

ఎప్పుడైతే మనల్ని మనం తెలుసుకోవాలనుకుంటామో, ధ్యానం చేస్తామో అప్పుడు మన ఆత్మశక్తి వికసిస్తుంది. తద్వారా గతజన్మ జ్ఞానం మనకు అందించ బడుతుంది. మన గతజన్మలను, కర్మరుణాలను సాధన చేసి తెలుసుకోగలిగితే దాని వలన మన ఆత్మాభివృద్ధి విపరీతంగా పెరుగుతుంది. తద్వారా కొన్ని వందల జన్మలలో నేర్చుకోవలసిన దానిని ధ్యానంచేసి "ఎరుక" పెంచుకోవడం వలన తక్కువ జన్మలలో సాధిస్తాము. సరియైన శిక్షణ పొందిన విద్యార్థి ఎక్కడ విఫలం అవకుండా నిర్దేశించిన కాలంలో తన విద్యాభ్యాసాన్ని పూర్తి చేసుకున్నట్లన్నమాట.

ధ్యానం వలన మన ఆత్మప్రగతి భూలోకంలో "ప్రారంభమై" సూక్ష్మ లోకాలలో మరింత "అభివృద్ధి" చెందుతుంది.

ఒకవేళ గతజన్మల జ్ఞానం తిరిగి పొందాలంటే ఎక్కువగా తెల్లవారు జామున ధ్యానం చెయ్యండి.

## కర్మచక్రం నుండి బయట పడటానికి కొన్ని సులువైన మార్గాలు

రేపటి కోసం ఎదురుచూడకుండా ఇప్పుడే ధ్యానం ప్రారంభించండి. మీరు నడుస్తున్న హింసామార్గాన్ని మార్చుకోండి. భవిష్యత్తు కోసం ఆలోచించకండి. మన చేతిలో ఉన్నది ఈ క్షణం మాత్రమే. సమయం చాలా విలువైనది. మన ఆధీనంలో ఉన్న ఈ క్షణమే ముఖ్యమైనది. కాబట్టి ఈ క్షణమే జీవించడానికి ప్రయత్నం చెయ్యండి. ధ్యాన సాధన చేస్తే కర్మబంధాల నుండి బయటపడటం చాలా తేలిక. పూర్తి అంకిత భావంతో, నిజాయితీతో ధ్యానం కొంతకాలం చేసినట్లయితే అపుడు సులభమవుతుంది.

మనకు కావల్సిందల్లా దృఢమైన నిర్ణయం. ఎందుకంటే బంధాలు, ఆకర్షణలు, భ్రమలు కల్గించే ఆనందమనేది అనేక జన్మల తరబడి మోయడం వలన అది శక్తివంతమైన అజ్ఞానంగా మారి దానిని చేదించడం కష్టతరంగా ఉంటుంది. కాని నిరంతరము ధ్యానం, సజ్జన సాంగత్యం, స్వాధ్యాయం చేయడం వలన ఆ అజ్ఞానం నుండి విడుదల సాధ్యం అవుతుంది.

ఆదినుండీ మన కోసం వేచి ఉన్న ఆత్మవిజ్ఞానం, మన అజ్ఞానంవలన అది అలవికానిదిగా ఉండి మన ఊహలకు అందనంత ఎత్తులో ఉంటుది.

ధ్యానం చేసి ఒకసారి ఆ బ్రహ్మానందాన్ని చవి చూసినట్లయితే, అదేమిటో మనం తెలుసుకున్నట్లయితే ఈ ప్రాపంచిక వాంఛలకు ఎప్పుడూ మనం బంధీలం అవకుండా ఉంటాము.

జ్ఞానం వలన మన వ్యక్తిత్వం మార్పుచెంది క్రమేపి కర్మచక్రం నుండి వైదొలుగుతాం.

ఎప్పుడూ మన ఆలోచనలపైన, మన చర్యలపై నిఘా ఉంచి ఆత్మజ్ఞానం కోసం సాధన చేసుకుంటూ, మనలో దాగి ఉన్న వ్యామోహాలని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ ఉండాలి. ఎల్లవేళలా ప్రేమభావన కలిగి ఉండి అనుక్షణం ఆనందంలో గడపాలి. కర్మచక్రం నుండి బయటపడే అతిసులువైన మార్గము ఇదే!

ఒక సామాన్యమైన, సంతృప్తికరమైన జీవితాన్ని గడపడం, సకల ప్రాణులపై సంపూర్ణమైన ప్రేమ, దయ, వివేకము కలిగి విచక్షణా జ్ఞానంతో జీవితాన్ని జీవించడం, అడుగడుగునా ఎరుకతో కోరికలను అనుభవిస్తూ మనలో భావోద్రేకాలు, మనోవికారాలను తెలుసుకొని మనల్ని మనం అదుపులో పెట్టుకోగలగాలి. అపుడే మనం కర్మచక్రాన్ని అధిగమించగలం. కర్మచక్రానికి ముగింపుగా కర్మబంధాల నుండి ఈ క్రింది మార్గాల ద్వారా మనం బయటపడవచ్చునని “భీష్మపితామహుడు” తెలియచేసారు.

1. సామాన్యమైన జీవితాన్ని గడపండి.
2. ఎప్పుడూ సకల సృష్టినీ ప్రేమిస్తూ, ప్రక్కవారి ప్రేమిస్తూ వారి పట్ల శ్రద్ధ చూపండి.

3. మీ మనస్సుకి మీరు యజమానిగా మారండి.
4. మీ మనస్సుకి సత్యమైన విజ్ఞానాన్ని అభ్యసించడం వలన అది ఆత్మజ్ఞానానికి దారితీస్తుంది.
5. మీలో అంతర్గతంగా దాగి ఉన్న శక్తిని గుర్తించి తద్వారా అనంతమైన జ్ఞానాన్ని పొందండి.
6. మిమ్మల్ని సరి అయిన దారిలో నడిపించడానికి మీ మహాకారణ శరీరంతో అనుసంధానానికి సదా ప్రయత్నించండి.
7. మితిమీరిన అతి కోరికల నుండి బయటపడండి.
8. మీ జీవితంలో జరుగుతున్న ప్రతీ ఒక్క సంఘటనను సంతోషంతో ఆహ్వానించండి. ప్రతీ మార్పూ మీరు నేర్చుకోవటానికే వచ్చిందని గుర్తుంచుకోండి!
9. ధైర్యముగా ఉండి, నిశ్చయభావం కలిగి, నిరంతరముగా శ్రమిస్తూ సత్యసాధనకై పాటుపడండి.
10. మీరు నేర్చుకున్న జ్ఞానాన్ని ఇతరులకు పంచండి. వారు అజ్ఞానం లోనుంచి బయటపడటానికి చేతనైనంత చేయూత నివ్వండి.
11. మూఢవిశ్వాసాలను, అవిశ్వాసాలను ఎప్పుడూ నమ్మకండి, ప్రచారం చేయకండి.
12. ప్రతీరోజు నిద్రపోయేముందు, నిద్రలేచిన వెంటనే "శ్వాస మీద ధ్యాస" ఉంచి ధ్యానం చెయ్యండి.
13. పూర్తిగా శాకాహారమే స్వీకరించండి. మాంసాహరం ఖచ్చితమైన కర్మబంధం. అది మీలో ప్రేమకవాటాలను మూసివేసే ఆహారం.

# కర్మధ్యాన అనుభవాలు

న్యూ ఏజ్ స్పిరిచ్యువల్ మాస్టర్ వంశీ గారి క్లాసులు విని కర్మసిద్ధాంతంపై అవగాహన కల్పించుకుని ప్రాక్టికల్‌గా కర్మధ్యానం సాధనచేసి తమ సమస్యలనూ, అనారోగ్యాలనూ తామే స్వయంగా నయం చేసుకున్న వాళ్ళు ఎంతో మంది. వారిలో కొంతమంది అనుభవాలను ఇక్కడ పొందుపరుస్తున్నాము.

## సమస్య నెం.1

నా పేరు రమేష్. మాది విశాఖపట్నం. నేను డిగ్రీ మొదటి సంవత్సరం చదువుతున్నాను. నాకు గత 5 సంవత్సరాలుగా మెడనొప్పి ఉండేది. ఎంతమంది డాక్టర్లను కలిసినా, ఎన్ని మందులు వాడినా నయం కాలేదు. ఎప్పుడూ మెడకు ఒక బెల్ట్ వేసుకొని ఉండేవాడిని.

ఒక రోజు మాస్టర్ వంశీగారి ధ్యానం క్లాసుకి వెళ్ళడం జరిగింది. అప్పుడు ఆయన కర్మసిద్ధాంతం గురించి చెప్పారు. మనం ఏదైనా బాధను అనుభవిస్తుంటే దానికి గతకాలపు కారణం ఒకటి ఉంటుందని, దానిని మనం కర్మధ్యానం చేసి తెలుసుకోవచ్చునని చెప్పారు. నాకు అది ఎంతో నచ్చింది.

తెల్లవారుజామున 3గం॥లేచి కాసేపు ధ్యానం చేసాను. కళ్ళు తెరవ కుండానే మనస్సులో "మాష్టర్స్ నేను మెడనొప్పితో బాధపడు తున్నాను. అంటే గతంలో ఎప్పుడో ఎవరినో బాధించాను, కనుక దయచేసి గతంలో నేను చేసిన హింసను చూపించండి అని కోరుకొని మరి కొంతసేపు ధ్యానం చేసి నిద్రపోయేవాడిని. అలా కొన్ని రోజులు చెయ్యగా, చెయ్యగా నాకు 15వ రోజు ఒక కల వచ్చింది. నేను గతంలో ఒక కుక్కను ఒక దుడ్డు కర్రతో మెడమీద కొట్టి చంపాను. అది ఎంతో స్పష్టంగా కనిపించింది. అది చూడగానే నాకు ఎంతో బాధ కలిగింది. నేను ఒక జీవినీ గతంలో ఎంతో హింసించానని అర్థం అయింది. తరువాత ధ్యానంలో కూర్చుని ఆ కుక్కను క్షమించమని కోరుకున్నాను. ఇంకెప్పుడూ ఏ జీవిని హింసించను అని, మాంసాహారము తినను అని మనస్సులో ప్రతిజ్ఞ చేసుకున్నాను. ఎంత విచిత్రం అంటే 30 రోజులు తరువాత నా మెడనొప్పి మాయం అయ్యింది. ఇది నిజంగా నా జీవితంలో జరిగిన ఒక పెద్ద మిరాకిల్. మాష్టర్స్‌కి మాట ఇచ్చినట్లు ఆ రోజు నుండి నేను మాంసాహారం పూర్తిగా మానివేసాను.

## సమస్య నెం. 2

నా పేరు రాజేశ్వరి. మాది నెల్లూరు. నాకు గుండెజబ్బు ఉండేది. బైపాస్ సర్జరీ చేశారు. సుమారు 3 లక్షలు ఖర్చు అయ్యింది. కాని ఇంకా సమస్య తీరలేదు. గుండె నరాలు పనిచెయ్యడం లేదు. మరో 5లక్షలు

ఖర్చు ఉంది" అన్నారు డాక్టర్లు. నాకు చావు తప్ప వేరే దారి దొరకలేదు. ఒకరోజు నెల్లూరు చిల్డ్రన్స్ పార్కు ప్రక్కన ఉన్న సాయిబాబా గుడిలో కూర్చుని ఎంతో వేదనతో, దిగులుతో సాయినే చూస్తు ఉన్నాను.

ప్రక్కనే ఉన్న సాయి ధ్యానమందిరం నుండి మైక్‌లలో మాటలు వినిపిస్తున్నాయి. ఎవరో ప్రవచనం చెపుతున్నారు. మనకెందుకులే అనుకుంటూ బాబా నన్ను కాపాడు, కరుణించూ అనుకుంటూ సాయివైపే చూస్తూ కూర్చున్నాను. దానికి సమాధానం అన్నట్లు "నిన్ను నీవే కాపాడుకోవాలి"అంటూ గంభీరస్వరం మైకు నుండి వినిపించింది. అది పట్టించుకోకుండా ఈ బాధలనుండి నీ శక్తితో బయటపడెయ్యి బాబా అనుకుంటున్నాను. వెంటనే మైకులో "మీ శక్తి మీ వద్దే ఉంది" అంటూ మళ్ళీ మాటలు వినిపించాయి. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఇతను ఎవరు నా మనస్సు చదివినట్లే మాట్లాడు తున్నాడు. అనుకుంటూ ఆ మందిరం వద్దకు వెళ్ళి అతన్నే చూస్తూ ఆ మాటలు వింటూ కూర్చున్నాను. అతని ప్రసంగం ధారాళంగా గంటసేపు సాగింది. నన్ను నేను మైమరచిపోయాను. అన్ని సమస్యలకు సమాధానాలు మన వద్దే వున్నాయి. మన వాస్తవాలకు మనమే సృష్టికర్తలం! అంటూ చెప్పిన అతని మాటలు నాకు చాలా నచ్చాయి. అతను వంశీ మాష్టారని తరువాత తెలిసింది. వారు చెప్పిన 'కర్మధ్యానం' ఇంటికి వెళ్ళి మొదలుపెట్టాను. ప్రతిరోజు తెల్లవారు జామున 3 గం॥లేచి ధ్యానం చెయ్యడం, గుండెజబ్బుకు కారణం తెలియచేయమని బాబాని కోరుకోవడం, ధ్యానంలో అలా నిద్రపోవడం చేసాను. ఇలా 40 రోజులు చేసాను. ఒక రోజు తెల్లవారుజామున నాకు ఒక కల వచ్చింది. ఆ కలలో పిల్లలు ఆడుకుంటున్న ఒక కుందేలును నేను పట్టుకొని ఎవరికో ఇచ్చి దాన్ని కోసి వండమన్నాను. దాన్ని కోస్తుంటే దాని గుండె ఎంతో అందంగా కనబడింది. దాన్ని పీకి నా పిల్లలకు రుచిగా వండిపెట్టాను. వెంటనే మెలకువ వచ్చింది. అంటే గత జన్మలో ఒక కుందేలు బ్రతికి ఉండగానే గుండెను పీకాను. ఎంత దారుణంగా ప్రవర్తించాను. నాకు 'గుండెజబ్బు దాని వలనే వచ్చింది' అని అర్థం అయ్యింది. ఒక ప్రాణి యొక్క గుండెను నిర్దాక్షిన్యంగా చిదిమేసాను. నా గుండె బాధ అనుభవిస్తున్న ప్రతిసారీ గుండె యొక్క విలువ తెలుసుకోవాలని నేను 'గుండె జబ్బు'ను ఇష్టపూర్వకంగా ఎంచుకు వచ్చానని

నాకు నేనే తెలియజెప్పుకున్నాను.

తరువాత ధ్యానంలో కూర్చుని ప్రకృతికి క్షమాపణ చెప్పాను. ఆ కుందేలును కళ్ళముందుకు తెచ్చుకొని మనస్ఫూర్తిగా క్షమాపణ కోరుకున్నాను. అలా కొంతకాలం గడిచాక, డాక్టరు దగ్గరకు వెళ్ళి పరీక్షించుకున్నాను. ఆయన మీకు ఇక ఆపరేషన్ అక్కరలేదు. మీ గుండె నరాలు పనిచెయ్యడం మొదలుపెట్టాయి. మీరు మందులు వాడితే చాలు అన్నారు." నేను ఇప్పుడు ఆ మందులు కూడా వాడడం లేదు. ఆ గుండెనొప్పి ఎక్కడికి పోయిందో బాబాకి ఆత్మ ప్రణామాలు. వంశీమాష్టర్‌కి శతకోటి కృతజ్ఞతలు.

## *సమస్య నెం.3*

నా పేరు సక్కుబాయి. మాది కృష్ణాజిల్లా గుడివాడ. నా శరీరమంతా చిన్న చిన్న పుళ్లతో ఉండేది. డాక్టర్స్‌కి చూపిస్తే 'ఇది చాలా అరుదైన చర్మవ్యాధి' అంటూ ఏవో మందులు ఇచ్చారు. కాని అవి పనిచెయ్యలేదు. చలికాలమైతే చర్మం పుండుపడి, చీము కారుతూ చాలా అసహ్యంగా ఉంటుంది. అలాంటి సమయంలో గుడివాడ కృష్ణ మందిరములో భగవద్గీత యజ్ఞం జరుగుతుంది' అని చెప్పితే ఆ క్లాసు విందామని వెళ్లాను. ఆ క్లాసులో వంశీ గారు "కర్మ"అనే అంశంపై చెపుతున్నారు. "ఏ వ్యాధి అయినా, ఏ బాధైనా అనుభవిస్తున్నా మంటే అది ఎందుకు వచ్చిందో తెలుసుకుని నయం చేసుకొనే మార్గం కర్మధ్యానం అని చెప్పారు." దీనికి కావలసింది ఎంతో నమ్మకం, ఓర్పు అని కూడా చెప్పారు. నేను ఇంటికి వెళ్ళి ఆలోచించాను. "నేను ఈ చర్మవ్యాధితో ఎంతో బాధపడుతున్నాను. ఇది కూడా కర్మేనేమో. ఈ కర్మధ్యానం చేసి చూద్దాం అనుకొని ఎంతో నమ్మకంతో కర్మధ్యానం మొదలుపెట్టాను. ధ్యానంలో మాష్టర్స్‌ని అడిగాను, "నేను ఈ వ్యాధితో బాధపడుతున్నాను. అంటే గతజన్మలో ఎవరినో బాధపెట్టాను, దయచేసి నాకు అదేమిటో చూపించండి" అని ధ్యానంలో కోరుకున్నాను.

అలా రోజూ కర్మధ్యానం చెయ్యగా, చెయ్యగా 18వ రోజు ఒక కల వచ్చింది. అది కల కాదు "థర్డ్ ఐ విజన్" అని వంశీ మాష్టర్ తరువాత చెప్పారు. ఆ విజన్‌లో నేను ఒక మేకలాంటి ప్రాణిని పట్టుకొని బతికి ఉండగా దాని చర్మం ఒలుస్తున్నాను. ఆ జీవి ప్రాణభయంతో, నొప్పితో

అరుస్తూ వుంది. ఆ జంతువు ఆర్తనాదాలు నాకు ఇప్పటికీ గుర్తున్నాయి. నాకు వెంటనే మెలకువ వచ్చింది. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. నాకు అర్థం అయ్యింది. నేను గతంలో ఒక ప్రాణిని ఎంతగా హింసించానో! నా చర్మం కొంత చిట్లగానే ఎంతో బాధపడుతున్నాను. ఆప్రాణికీ ఎంత వేదన కలిగించాను. "మాష్టర్స్ నన్ను క్షమించండి. ఇంకెప్పుడూ ఏ ప్రాణికీ హింస కలిగించను" అని మనస్ఫూర్తిగా ధ్యానంలో కూర్చుని కోరుకున్నాను. అప్పటి నుండి మాంసాహారం తినడం, వండడం మానివేశాను. ఇది జరిగిన 6 నెలల్లో నా చర్మంపై ఉన్న ఆ పుండ్లు అన్నీ క్రమంగా తగ్గిపోయాయి. ఇప్పుడు పూర్తి ఆరోగ్యంతో ఉన్నాను. ఈ కర్మ ధ్యానం నా జీవితాన్ని మార్చేసింది. నేను ఒకటి మాత్రము ఖచ్చితంగా చెప్పగలను. "మన వాస్తవానికి మనమే సృష్టికర్తలం అనేది పరమ సత్యము".

## *సమస్య నెం.4*

నా పేరు వేణు. మాది హైదరాబాద్. నాకు రెండు కాలివేళ్ళకు పొక్కులు వుండి బాగా వాచిపోయి ఉండేవి. తొందరగా నడవడానికి ఇబ్బందిపడేవాడిని. అందరితో కలిసి తిరగలేకపోయేవాడ్ని. ఒకసారి నాగార్జునసాగర్ వద్ద పౌర్ణమి ధ్యానం జరిగినప్పుడు హైదరాబాదు నుండి ఒక బస్సు వేసుకొని చాలా మంది వెళుతుంటుంటే నేనూ వారితో వెళ్ళాను.

ఆపౌర్ణమి వెన్నెలలో అందరూ ధ్యానంచేస్తూ, ఆడుతూ పాడుతూ సరదాగా గడుపుతున్నారు. నేనూ ఆడుకుందామంటే నా కాళ్ళు సహకరించడం లేదు. ఆ దేవుడ్ని తిట్టుకుంటూ నిరుత్సాహంగా ప్రక్కన కూర్చున్నాను. వంశీమాష్టర్ నన్ను గమనించి నా వద్దకు వచ్చి "ఎందుకలా నీరసంగా, దిగులుగా ఉన్నావు. అందరూ ఆనందంగా ఆడుతూ పాడుతూ ఉన్నారు. నీవు వారితో వెళ్ళి సరదాగా గడుపు" అన్నారు.

"చూడండీ మాష్టర్, నేను ఏం పాపం చేసానో ఏమో దేవుడు నాకు ఈ శిక్ష విధించాడు" అంటూ కన్నీళ్ళుపెట్టుకుంటూ. నా సమస్యను వివరించాను.

వంశీమాష్టర్ అనునయంగా "ఏం పాపం చేసానో అన్నావు కదా!

దాన్ని నీవే తెలుసుకో" అన్నారు. ఎలా తెలుసుకోవాలి అన్నాను. వంశీమాష్టర్ కర్మ ధ్యానం గురించి వివరించారు. నీ సమస్యకు కారణం నీకు మాష్టర్స్ చూపిస్తారు అన్నారు.

అయితే నాకు గతంలో ఎప్పుడూ ఒక కల వచ్చేది. అది ఏమిటంటే, ఎవరివో రెండు కాళ్ళు కనిపిస్తాయి. అవి రెండూ బాగా దెబ్బలతో, గాయాలతో ఉంటాయి. "22రాళ్లు తగిలించు"అనే మాటలు వినిపిస్తూ ఉండేవి. బహుశా నా కాళ్ళకి 22 రాళ్లను తాకిస్తే ఈ పొక్కులూ, వాపులూ తగ్గిపోతాయోమో అనుకుంటున్నాను. ఆ 22రాళ్లు, ఏ రాళ్లో అర్థం కావడం లేదు అని చెప్పాను.

వంశీగారు 2ని॥కళ్ళు మూసుకొని ఆలోచించి ఇలా చెప్పారు. "చూడు వేణు, నీకు మాష్టర్స్ మెసేజ్ ఇస్తున్నారు, కాని అది నీకు అర్థం కావడం లేదు."

అది ఏమిటంటే "22 రాళ్లు తగిలించు అని కాదు, 22 రాళ్లు తగిలించావు "అని చెప్పారు. అంటే గతజన్మలో నేను ఒక వ్యక్తి కాళ్ళను 22 రాళ్లతో కొట్టిగాయపరచి అతన్ని అవిటివాడిని చేసాను. తిరిగి "జన్మ తీసుకొన్నపుడు కాళ్ళ విలువ" తెలుసుకోవడానికి, ఈ సమస్యను తెచ్చుకున్నాను అని అర్థమయ్యింది.

తరువాత ఎప్పుడు ధ్యానంలో కూర్చున్నా ఆ కాళ్ళను గుర్తుకు తెచ్చుకుని ఆ కాళ్ళకు నమస్కారం చేసి క్షమాపణ కోరుకున్నాను. ఇప్పుడు నా కాళ్ళ పొక్కులు సంపూర్ణంగా నయమయ్యాయి. నేను ఎంతో చక్కగా నడవ గలుగుతున్నాను.

నా అనుభవంలో నేను తెలుసుకున్నది ఏమిటంటే, మనం అనుభవిస్తున్న బాధలకి కారణం మనమే అని చెప్పడానికి మాష్టర్స్ అనేక ప్రయత్నాలు చేస్తుంటారు. అందులో 'స్వప్నాలు' ఒకటి. కాని అవి మనకు అర్థం కాక వదిలేస్తున్నాము. ధ్యానం ప్రతీరోజు చేసినట్లయితే అవి మనకు అర్థమోతాయి. కనుక మనం రోజూ తెల్లవారు జామున ధ్యానం చెయ్యాలి. తద్వారా మాష్టర్స్ మెసేజ్‌ను అర్థం చేసుకోగలం.

# కర్మధ్యానం చేసే పద్ధతి

మనకు ఏవైనా శారీరక, ఆర్థిక, కుటుంబపరమైన సమస్యలు ఉంటే అంతా నా కర్మ అని బాధపడతాం. అది మానివేసి గతంలో గత జన్మల్లో ఎటువంటి దుష్కర్మలు చేశామో తెలుసుకొని మాస్టర్ సహాయంతో వాటిని పోగొట్టుకోవచ్చు. కావలసిందల్లా కర్మధ్యానం చేసి ఆస్ట్రల్ మాస్టర్స్‌తో అనుసంధానం అవ్వడమే.

1. నిద్రపోయే ముందు కాసేపు ధ్యానం చేసి తెల్లవారుఝామున మెలకువ రావాలని మాస్టర్స్‌ని కోరుకొని నిద్రపోండి.
2. తెల్లవారుఝామున ఏదో సమయంలో మాస్టర్స్ ఖశ్చితంగా నిద్రలేపుతారు... అదే ప్రదేశంలో కళ్ళు రెండూ మూసుకుని స్థిర సుఖాసనంలో కూర్చుని "శ్వాసమీదధ్యాస" ఉంచి కాసేపు ధ్యానం చేయాలి.
3. ఆలోచనలు అన్నీ శూన్యం అయ్యాక మనస్సులో "మాస్టర్స్ నేను ఈ బాధను అనుభవిస్తున్నానంటే ఎప్పుడో ఎవరికో ఇటువంటి బాధే కల్పించాను. దయచేసి దానిని నాకు చూపించండి" అని ఆర్తిగా వినయంతో మూడు సార్లు మనస్సులో కోరుకోండి.
4. కళ్ళు తెరవకుండానే మరికొంచెం సేపు ధ్యానం చేసి నిద్రపోండి.
5. అలా ప్రతిరోజూ చేస్తే 40 రోజుల్లో ఏదో ఒకరోజు "స్వప్న సందేశం" అందుతుంది.
6. ఆ స్వప్నంలో మీచే హింసించబడ్డ వ్యక్తి లేదా ప్రాణి కన్పిస్తుంది. తర్వాత ఎప్పుడు ధ్యానంలో కూర్చున్నా మీ వల్ల బాధింపబడ్డ వారికి క్షమాపణ చెప్పండి. మీ క్షమాపణ యొక్క తీవ్రతను బట్టి మీ కర్మ దగ్ధం అవుతుంది.
7. పూర్తిగా శాకాహారమే స్వీకరించండి. మాంసాహారం ఖచ్చితమైన కర్మబంధం. అది మీలో ప్రేమకవాటాలను మూసివేసే ఆహారం.

*"జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం"*

*మీ అభిప్రాయాలను, మీకు కలిగిన సందేహాలను, మీకు వచ్చిన స్వప్న సందేశాలపై వివరణను మరియు వంశీ మాస్టారుతో కౌన్సిలింగ్ తీసుకోవాలనుకునేవారు 92466 72172, 98484 60470 ఫోన్ నెంబర్‌లలో సంప్రదించండి. మీరు కూడా మీ మీ సమస్యలను స్వయంగా ధ్యానం చేసి పరిష్కరించుకుంటారని, ఈ పుస్తకం మీ జీవితాన్ని మారుస్తుందని కోరుకుంటూ....*

డైరెక్టర్స్

**ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పిరిచ్యువల్ సైన్స్ & రీసెర్చ్ సెంటర్**